

'వాండా బెయిలీ' టెలివిజన్ తారలలో ఒకరు. నృత్యం వచ్చు.

[redacted]

బహుముఖ ప్రజ్ఞావంతులైన ముగ్గురు
కథానాయకులు కలిసి తొలిసారిగా
నటించిన కొత్తతరహా సాంఘిక గాథ!




డి.వి.యస్.
ప్రొడక్షన్స్ వారి

# చిన్ననాటి స్నేహితులు

నిర్మాత: డి.వి.యస్. రాజు
దర్శకత్వం: కె. విశ్వనాథ్ B.Sc.,

రిలీజు: ఆంధ్ర: విజయా సీడెడ్: జయలక్ష్మి నైజాం: ఉషా. మైసూర్: బాలాజీ నార్త్ ఇండియా: విఘ్నేశ్వర

VIJAYA

# ఉత్తరాలు

### బాపూజీకి ఉత్తరం

బాపూజీ !
మీకు వుత్తరం వ్రాయాలనే వూహ తట్టింది
లోకంపోకడ తెలపాలనే మోజు పుట్టింది.
అందుకే వ్రాస్తున్నా ఈ వుత్తరం.

జాగుసేయక సత్వరం.
మంచిని కంచికి పంపించి
వంచనకు హారతి పడుతున్నాం
నీతిని గోతిలోకీడ్చి,
కోతి మూకలా వ్యవహరిస్తున్నాం.
'ఇజాలు' భూభుజాలపై —
విలయతాండవం చేస్తున్నాయి.
'నిజానికీ' మాకు కొన్ని—.
యోజనాల దూరం

అవృతం మా ఆయువు పట్టు
అపకారం మాజీవిత లక్ష్యం.
కులమత ద్వేషాలు,
యుద్ధోన్మాదాలు,
నిప్పులేని చోట నిప్పుపుట్టిస్తాం.

గాంధిజీ!
ఇదే మేం సాధించిన ప్రగతి.
ముమ్ముందు యింతకు పదింతలు సాధిస్తాం.
ఇంకా మీపేరు మరచి పోలేదులేండి.

మీ వూరు పేరుగూడా గుర్తుంది.
అందుకే,
మధ్య మధ్య మీపేర పళలు జరుపుకుంటున్నాం.

కాని,
గుర్తుతెందల్లా ఒక్కటే.
అదేవంటే ....అదే
"అదేమిటో" ఆఖరికి
మీ వూహకు తట్టే వుంటుంది.
ఇదంతే మాలోకం.
ఇదంతా మాలోకం.
ఇప్పటికే చాల వ్రాశాను
మరిక నే వుంటాను.

బి. యల్. నరసింహారావు [ పైలాన్ ]

### ముఖచిత్రం

'శ్రీ కృష్ణసత్య'లో రామారావు ముఖచిత్రం చాలా బాగావుంది. సినిమాల గూర్చి మీరందించినంత త్వరితంగ ఏ పత్రికా కొత్త సమాచారం ఇవ్వడం లేదంటే అతిశయోక్తి ఎంతమాత్రం లేదు.

ఇటీవల ముగిసిన 'పావ నవ్వింది' సీరియల్ ఎక్స్‌లెంట్. రచయిత్రికి అభినందనలు.

మాధవి, [ కోదాడ్ ]

* * *

గోపాలకృష్ణుడు ముఖచిత్రం, యన్. టి. ఆర్. చాలా ఆకర్షణీయంగా వున్నది.

కె. సావిత్రి, [ విజయనగరము ]

* * *

అట్ట వెనుకనున్న పద్మశ్రీ అక్కినేని నాగేశ్వర రావు, వాణిశ్రీ వర్ణచిత్రం చూడ ముచ్చటగా యుంది. 'వియ్యమా—కయ్యమా' కథ నన్నెంతో ఆకర్షించింది.

లతీఫుద్దీన్ అహమద్, [ సుల్తానాబాద్ ]

### వ్యాసాలు

17—9—71 పత్రికలో డా. నాయుడమ్మ గారి గురించి పర్వతనేని గంగాధరరావు గారు వ్రాసిన వ్యాసం చదివి చాలా ఆనందించాము. డా. ఆత్మారాం రిటైరయిన తర్వాత ఆస్థానం పొంద గల్గినది డా. నాయుడమ్మ గారేనని మొదటే ఊహించాను. సరిగ్గా నేనూహించినట్లే జరిగింది. అంతటి వున్నత పదవి అధిష్ఠించిన మేధావి, పిన్న వయస్కుడూ, అందునా ఆంధ్రుడయిన డా. నాయుడమ్మకి అభినందనలు.

గంగాధరరావుగారు తమ వ్యాసంలో నేషనల్ లేబరేటరీస్ డైరెక్టర్లందరిలోనూ డా. నాయుడమ్మ చిన్నవారని (వయస్సులో) వ్రాశారు. కాని అది సరియైనది కాదని నా అభిప్రాయం. కారైకుడిలోని సెంట్రల్ ఎలక్ట్రో కెమికల్ రిసర్చ్ ఇన్స్‌టిట్యూట్ డైరక్టరు గారయిన డా. వుడుపా వయస్సులో డా. నాయుడమ్మ గారి కంటే చిన్న వారని నా అనుమానం.

—శ్రీమతి కె. లక్ష్మి రావ్. (మద్రాసు)

* * *

నెమలిని ధిక్కరించు కాంతలు
ప్రియముతో ధరించి
సంతసింపజేయు
అంగీలు, లుంగీలు.
అందచందాల అంగీ, లుంగీలను
అమితముగా అందజేయునది
హాండ్‌లూమ్ హౌస్. మీ
అందమును మెరుగుదిద్ది
మనస్సుకు నచ్చినవారిని
ఆకర్షించుటకు ఇవే
సాధనములు! ఎన్నుకొను
వివిధ వర్ణ పట్టు వస్త్రములు
కంటికి రమ్యమైన పట్టు
చీరలు కూడా మీ కరములతో
స్పృశించుటకు
ఎదురుచూచుచున్నవి.



హాండ్‌లూమ్ హౌస్
9, రత్తన్ బజార్
మద్రాసు-3

FDSHH (69) TE

పండుగలకు ఇవ్వబడు 10% స్పెషల్ రిబేటు పొందండి. ఆదివారములు కూడా తెరచియుంచబడును.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 8—10—'71

శ్రీ విరోధికృన్నామసం॥ భాద్రపదమాసం శు॥ పంచమి

సంపుటము : 65 సంచిక : 7

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1

విడి ప్రతి వెల 40 పైసలు

పోస్టుద్వార

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13·00 |
| 3 మాసముల చందా | 6·50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి మంజుల



## ఉత్తరాలు

వచ్చి యున్నట్లయితే ఏమన్నా మార్పు జరిగేదేమో గాని ప్రస్తుత పరిస్థితులలో మార్పు అసాధ్యం.

ఆంధ్రప్రదేశ్ ఎంతో కాలం నిలువదు. మళ్లీ ఆంధ్రరాష్ట్రంగా విడిపోయే సుదినం దగ్గరకు వచ్చింది. ప్రస్తుతం ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలకు వేరువేరు బడ్జెటులు ఉన్నాయి. నదుల నీటి పంపిణీ ఏనాడో జరిగిపోయింది. ఏ ప్రాంతం ఉద్యోగులు ఆయా ప్రాంతాలలోనే ఉండడమో, వ్యాడడమో జరుగాలి. వేరే దారిలేదు. తెలంగాణా ప్రాంతీయ సంఘానికి చట్టబద్ధమైన అధికారాలు తెలంగాణాకు ప్రత్యేక పి. సి. సి. ఏర్పాటు చేసే ప్రతిపాదనలు జరిగాయి. అవి 1972 మార్చి ముందుగా అంటే సాధారణ ఎన్నికలకు ముందుగా సుప్రభాతం పాడుతాయి. సత్వరమే జరుగవలసినది జరిగేది జరుగబోవునది రాష్ట్ర విభజనే. ఇది 1972లో కావచ్చు, తప్పితే 1977లో గ్యారంటీ.

పై విషయాలు రాష్ట్ర సమైక్యతను సూచిస్తున్నాయో, వేర్పాటు చేస్తున్నాయో గ్రహించలేని మూర్ఖులు కారు యీ ప్రజలు. ప్రస్తుతం తెలంగాణాకు అదనపు ప్రధాన కార్యదర్శిని నియమించడం జరిగింది. అలాగే అదనపు ప్రధాన న్యాయమూర్తిని త్వరలోనే నియమిస్తే ఆశ్చర్యపోనక్కరలేదు. ఇవి అన్నీ రాష్ట్ర సమైక్యతకే గదా!

సమగ్ర రాష్ట్రము గురించి ఊకదంపుడు ఉపన్యాసాలు వ్యర్థ వివాదాలు చేసే నాయకులు కేవలం వారి రాజకీయ స్వార్థానికే తప్ప ప్రజా క్షేమానికి కాదు. ప్రస్తుతం హైదరాబాదు నగర పురోభివృద్ధి స్తంభించిపోయింది. రాష్ట్ర విభజనం తర్వాతే దాని అభివృద్ధి. అంతవరకు దానికి మోక్షం లేదు.

తెలంగాణా యీనాడు యీమాత్రమైనా అభివృద్ధి అయిందంటే దానికి కేవలం ఆంధ్ర ప్రాంత ప్రజల కృషేనన్నది నగ్న సత్యం. దీనిని కాదనగలవారు లేరు. ఏది ఏమైనా యీ రెండు ప్రాంతాలు త్వరలో విడిపోయే శుభదినం కొరకు ఎదురు. చూద్దామా?

ముద్దం సీతారామరావు ( రాజమండ్రి )

### మనవి

ఆంధ్రసచిత్ర వారపత్రిక తే. 10—9—71 సంచిక 28వ పేజీలో ప్రచురింపబడిన కార్టూన్ చిత్రకారుడు శ్రీ గుప్త తమ పూర్తి చిరునామాను వెంటనే మాకు తెలియజేయ గోరుతున్నాము. — సం॥

* * *

గతవారం సంచికలోని 50వ పేజీలో పడిన వాణిశ్రీ బొమ్మ 'జగత్ జంత్రీలు' చిత్రంలోనిది పాఠకులు గమనించగోరుతున్నాము. —సం.

## రాజధాని కబురు

మన రాష్ట్రం పేరును ఆంధ్రదేశం అనో విశాలాంధ్ర అనో మార్చవలసిన ఆవశ్యకతను సూచిస్తూ 10—9—71 సంచికలో విశాఖపట్నం సోదరుడు కంచర్ల వెంకటరమణ వ్రాసిన దానితో మనస్ఫూర్తిగా ఏకీభవిస్తున్నాను.

నిజానికి ఈ ప్రస్తావన 1969 సం. కు పూర్వం

Chadalavada Sanjeeva Rao V.LW
Co/. Krishnavani




8-10-71

# బియ్యం ఎగుమతి వ్యాపారం - రాష్ట్ర రాజకీయాలు!

ఒకప్పుడు రోడ్ రవాణా వ్యవహారాలకు మన రాజకీయాలకు అవినాభావ సంబంధముండేది. చివరికి ఒక ముఖ్యమంత్రి—నీలం సంజీవరెడ్డిగారు—ఈ వ్యవహారాల మూలంగానే తమ పదవిని వదులుకోవలసి వచ్చింది. ఇప్పుడు బియ్యం ఎగుమతి వ్యాపారం మన రాజకీయాల్లోకి బాగా ప్రవేశించినట్లు కనిపిస్తున్నది. రెండుమూడు వారాల క్రిత[redacted]ట గుంట రైలు స్టేషనులో నూకల పేర మంచి బియ్యం సరుకుతో నిండిన 33 వాగన్ల గూడ్సు బండిని రాష్ట్ర విజిలెన్స్ సెల్‌వారు ఆపేశారు. ఇందులో చాలా కుంభకోణ ముందనీ, చాలా పెద్ద పెద్దవారికి స్మగ్లింగ్‌తో సంబంధముందనీ, ఈ విషయమై పూర్తి దర్యాప్తు కానిదే ఈ గూడ్సు బండిని రాష్ట్ర పొలిమేరలు దాటనీయ కూడదనీ, ఆమధ్య శాసనసభలో కూడా సభ్యులు గట్టిగా కోరారు. దర్యాప్తు జరుపుతామని మంత్రి ఆనం సంజీవరెడ్డి హామీ నిచ్చిన విషయం పాటకలోకానికి తెలిసిన విషయమే. అప్పటి నుంచి ఈ బియ్యం ఎగుమతులకు అధికార కాంగ్రెసు నాయక ప్రముఖులకు సన్నిహితమైన సంబంధమున్నదనీ, వచ్చే శాసనసభా ఎన్నికల్లో రైస్ మిల్లు యజమానులు చెల్లించిన మొత్తాలు విరివిగా ఉపయోగం కాబోతున్నాయనీ వదంతులు బయల్దేరాయి. పది రోజుల క్రితం ఉభయ గోదావరి జిల్లాల్లోను కృష్ణా జిల్లాలోను రైస్ మిల్లులపై సి. ఐ. బి. వారు ఏకకాలంలో మెరుపు దాడుల లాంటివి కొన సాగించారు. కేరళకు బియ్యం ఎగుమతికి అనుమతులు పొంది ఈ మిల్లు యజమానులు చెల్లించిన రాజకీయ రుసుము బాపతు రికార్డులను అధికారులు వశం చేసుకున్నారనీ, ఈ దాడులకు రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వంలో మార్పుకు సన్నిహితమైన సంబంధమున్నదనీ రాజధాని అభిజ్ఞవర్గాల చర్చల్లోకి వచ్చిన ప్రధానాంశం. వీటికి తోడు కొందరు అధికార కాంగ్రెసు ఎం. పీ.ల ఇళ్లను ఆదాయం పన్ను అధికారులు సోదా చేయటం—వీటితో కలిగిన సంచలనం అంతా ఇంతా కాదు.



శేశ్ ముఖ్యమంత్రి కాబోతున్న రాష్ట్ర విద్యాశాఖా మంత్రి వెంకట నరసింహారావుగారు

## కొత్త ముఖ్యమంత్రి గమనించాల్సిన విషయం

రాష్ట్ర రాజకీయ వ్యవస్థలో తాము ప్రవేశ పెట్టే మార్పులకు ఆటంకాలు కలుగకుండా ఉండేటందుకు బెదిరింపులుగా ప్రధానమంత్రి, ఈదాళ్లను, దర్యాప్తులను కొనసాగించారని భావిస్తున్న వారు లేకపోలేదు. కాని మన రాజకీయ జీవనం బియ్యం రాజకీయాలతో కలుషితమై పోయాయన్న భావం మాత్రం సర్వత్రా కలుగుతుంది. కొత్త ముఖ్యమంత్రి ఎవరైనా ఈ విషయాన్ని గమనించడం అవసరం. రాజకీయాల పట్ల రాజకీయ వాదుల పట్ల గౌరవ ప్రతిపత్తులు, ప్రజల్లో కలగాలంటే ఈ మొత్తం వ్యవహారంపై ఒక కమిషన్ ఆఫ్ ఎంక్వైరీ లాంటిది వేసి నిష్పాక్షికమైన విచారణ జరిపించడం అవసరమేమో కొత్త రాష్ట్ర ప్రభుత్వమూ, కేంద్ర ప్రభుత్వమూ ఆలోచించాలి. గ్రామ పంచాయతీ నుంచి శాసనసభా ఎన్నికల వరకు, అభ్యర్థులు పెట్టే ఖర్చులు, మేరు పర్వతంలా రానురాను పెరిగిపోతున్నాయి. ఈ ఖర్చులో అక్రమార్జనలకు సంబంధించిన డబ్బు భాగం అత్యధికం. కాగా అక్రమార్జనలను ప్రభుత్వం నిరోధించకలుగుతే, రాజకీయాల్లో దురాచారాలను చాలా వరకు నిరోధించవచ్చును. కాని ప్రవర్తనా ప్రమాణాలు దిగజారి పోయిన ప్రస్తుత వాతావరణంలో ఇలాంటి చర్యలు ఆశించడం, ఆకాశానికి నిచ్చెనలు వేసినట్లే అవుతుంది.

## విప్లవ కవుల విడుదల

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు, విప్లవ కవులు నిఖిలేశ్వర్, చెరబండ రాజు, జ్వాలాముఖి గార్లను ప్రివెంటివ్ డిటెన్షన్ నుంచి విడుదల చేస్తూ ఇచ్చిన తీర్పు మన సాహిత్య చరిత్రలోను ప్రజాస్వామ్యంలోను మైలు రాయిగా భావించవలసి వుంటుంది. న్యాయమూర్తులు చిన్నప్పరెడ్డి, ఏ. డి. వి. రెడ్డిగారి 19 పేజీల తీర్పు చదివినప్పుడు ఎవరికైనా మన న్యాయస్థానాల పట్ల గల గౌరవం, విశ్వాసం ఇనుమడించక తప్పదు. ఆంధ్రప్రదేశ్ ప్రివెంటివ్ డిటెన్షన్

చట్టం సెక్షన్ 6 ఏ ప్రకారం, ఒక వ్యక్తిని నిర్బంధించినప్పుడు అందుకు చూపిన కారణాల్లోని కొన్ని అస్పష్టమూ, అసందర్భమూ అయినంతమాత్రాన నిర్బంధం చట్టవిరుద్ధ మనడానికి వీల్లేదు. అంటే ఈ చట్టం అందులోని ఈ సెక్షన్ ప్రజాస్వామ్యానికి వ్యక్తి స్వేచ్ఛకు ఎంత ప్రమాదకరమైనదో అవగాహన మవుతుంది. ఏదో ఒక సందర్భశుద్ధి కల కారణం చూపి నిర్బంధించి ఇంకా ఎన్నో నిరాధారమైన ఆరోపణలను ప్రభుత్వం ఆరోపించవచ్చన్న మాట. అందుకే ఈ సెక్షను, రాజ్యాంగంలోని ఆర్టికల్ 22 (5) కు విరుద్ధం, అందులో పౌరుల కిచ్చినట్టి హక్కులకు భంగకరం అని న్యాయమూర్తులు భావించి, ఆ సెక్షన్ను రద్దు చేశారు. అసలు ప్రివెంటివ్ డిటెన్షన్‌కు వర్తించవలసిన సూత్రాలని కోర్టులు ఎన్నిసార్లు పేర్కొన్నప్పటికీ, ప్రభుత్వాలు విస్మరిస్తున్నాయని కూడా చెప్పారు. ఇరవై సంవత్సరాల క్రితం సుప్రీమ్ కోర్టు ప్రధానన్యాయమూర్తి పతంజలిశాస్త్రి ఒక కేసులో తీర్పు చెబుతూ వ్యక్తుల స్వాతంత్ర్యాన్ని అరికట్టేటప్పుడు తగు శ్రద్ధాసక్తులను కనబరచాలని కోర్టులు పలుసార్లు మందలించినప్పటికీ, ఈ విషయాల్లో ఎంతో అశ్రద్ధతోను అనాసక్తతతోను ప్రభుత్వాలు వ్యవహరిస్తుండడం శోచనీయమూ బాధాకరమూ అన్నారు. పతంజలిశాస్త్రి గారు పేర్కొన్న పరిస్థితి ఇప్పటికీ కొనసాగుతున్నదని, ఈ రచయితల కేసును బట్టి భావించవలసి వస్తున్నదని న్యాయమూర్తులు చిన్నపరెడ్డి, ఏ. డి. ఏ. రెడ్డి, తమ విచారాన్ని వెలిబుచ్చారు.

## నిర్బంధానికి తగినకారణాలు కాజాలవు

నిర్బంధానికి గల కారణాలను చూపుతున్న పత్రాలన్నింటినీ చట్టం సెక్షన్ 6 ప్రకారం నాకు తృప్తి కలిగింది కనుక మిమ్మల్ని నిర్బంధిస్తున్నానని పోలీసు కమిషనర్ పేర్కొన్నారు. అందుకే నిర్బంధపు ఉత్తర్వులు చెల్లనేరవని న్యాయమూర్తులు ఈ కవులను విడుదల చేస్తూ పేర్కొన్నారు. అంతేకాక వీరి నిర్బంధానికి చూపిన మూడు కారణాలు కూడా నిర్బంధానికి తగిన కారణాలు కాజాలవని న్యాయమూర్తులు అన్నారు. ఈ కారణాల్లో (1) ఆగ్రహము, ఉగ్రవాదమూ, యువత కల రచయితల సంఘాన్ని స్థాపించారని, (2) వీరికి మార్క్సిజం, లెనినిజం, మావోజంలో, నమ్మకమున్నదనీ, (3) శ్రీశ్రీని అభ్యుదయ రచయితల సంఘాన్ని వదిలి విప్లవ రచయితల సంఘం స్థాపించడానికి ప్రేరేపించారని.

## 'భావప్రకటనా స్వేచ్ఛ ఉండాలి'

వీరి నిర్బంధానికీ, పై మూడు కారణాలకు [illegible] మేమిటో అర్థం కావటం లేదని న్యాయమూర్తులు చెప్పారు. నిర్బంధించాలంటే ప్రశాంతికి భంగకరం ప్రధాన కారణం కావాలి. పై కారణాలు ప్రజా ప్రశాంతతకు ఎలా భంగకరమో తమకు అవగాహన కాలేదు. ఎవరివీ వారి నమ్మకాలను బట్టి నిర్బంధించడం తగదని న్యాయమూర్తులు చెప్పారు. కవనం ఆవేశానికి సంబంధించింది. అందులో అతిశయోక్తి సహజం. దాని ఆధారంగా కవిని నిర్బంధించడం హేతుబద్ధం కాదన్నారు. భావం ఎంత ప్రమాద గర్భితమైనా, నిర్బంధాని కారణం కాజాలదు. పైగా పై ముగ్గురి కవనంలో ఏదీ ప్రజల్లో అశాంతిని అల్లరిని కలిగించేవిగా లేవన్నారు. ప్రతిభావంలోను ప్రేరేపణ ఉంటుంది. దానితో నమ్మకం ఏర్పడుతుంది. నమ్మకాల వల్ల శ్రామికుల నియంతృత్వం ఏర్పడుతుందనీ ప్రజల్లో అధిక సంఖ్యాకులు దీన్ని అంగీకరిస్తే, అలాంటి భావాలను ప్రకటించుకునే స్వేచ్ఛ ఉండాలి. అప్పుడే వాక్ స్వాతంత్ర్యానికి అర్థముంటుంది. అని జస్టిస్ హోమ్స్ ఒక తీర్పులో పేర్కొన్నారని కూడా ఆంధ్రప్రదేశ్ న్యాయమూర్తులు చెప్పారు.

—వి. నాగేశ్వరరావు ●

# ముఖ్యమంత్రి ప్రశ్న

చంద్రశేఖరానికి — పాతికేళ్ళ సర్వీసు తర్వాత మొదటిసారిగా స్కూల్ ఫైనల్ పబ్లిక్ పరీక్షలకి, సాంఘిక శాస్త్రానికి పరీక్షాపత్రాన్ని సమకూర్చవలసిందిగా ఉత్తరువు వచ్చింది. 'మీకు ఎవరి సిఫారసువల్ల ఈ అదృష్టం వచ్చిందో మర్చిపోరాదు!' చంద్రశేఖరం భార్య పద్మావతి వోసారి హెచ్చరించి తన పని చూసుకోసాగింది. చంద్రశేఖరం తన కృతజ్ఞత తెలుపుకోవడం కోసం, వో ప్రశ్న ఇచ్చాడు.

మన రాష్ట్రానికి ముఖ్యమంత్రి—

ఎ) ఏరెడ్డి బి) బీరావు సి) సీరయ్య డి) డీలయ్య. ప్రశ్నాపత్రంతో సమాధానాలు కూడా యివ్వవలసిన బాధ్యత ఉంది కాబట్టి సమాధానంగా 'ఎ' యిచ్చాడు.

పరీక్షలు జరుగుతున్నాయి. మర్నాడు సాంఘికశాస్త్రం పరీక్ష అనగా, ఏరెడ్డి మంత్రివర్గం పడిపోయి, మరో మంత్రివర్గం రావడం బీరావు ముఖ్యమంత్రి అవడం జరిగింది.

సన్యాసిరాజుకి రాష్ట్రానికి ముఖ్యమంత్రి ఎవరో బాగా తెలుసు. రాష్ట్రంలో జరిగే ప్రతి ఉత్సవంలోనూ, ప్రతి ప్రారంభోత్సవంలోను పాల్గొనే ముఖ్యమంత్రి పేరు బాగా నలిగి ఉండడంవల్ల దర్జాగా, ధీమాగా 'ఎ' గుర్తు పెట్టాడు.

రామారావుకి ప్రతి రోజూ రేడియో వినడం అలవాటు. వాళ్ళ నాన్న—యింట్లో కుర్రాళ్ళందరూ ప్రతి రోజూ వార్తలు వింటే కాని ఊరుకోని యముడు కాబట్టి, రామారావుకి ఆ అలవాటువుంది. మంత్రివర్గం మారిన సంగతి తెలుసును కాబట్టి, ప్రశ్నకి సమాధానంగా 'బి' గుర్తు పెట్టాడు.

గుర్నాధం లాటరీలమీద, అంచనాలమీద నమ్మకమున్నవాడు. ఎప్పుడూ సినిమాలమీద, సిగరెట్లమీద ధ్యాస ఉన్నవాడు కాబట్టి, రాష్ట్ర రాజకీయాలు అసలే తెలియనివాడు కాబట్టి యిరుకులో పడిపోయాడు. అసలు రాష్ట్రానికి ముఖ్యమంత్రి ఎవరో తెలియదు. ఒక్కసారి తల పంకించి 'సి' గుర్తు పెట్టేశాడు.

వీర్రాజుకి చెమటలు పట్టేశాయి. దేశానికి ప్రధానమంత్రి, రాష్ట్రానికి ముఖ్యమంత్రి ఉంటారని కూడా తెలియని అజ్ఞాని కాని దేవుడిమీద నమ్మకమున్నవాడు. అంచేత దైవంమీద భారంవేసి, 'డి' గుర్తు పెట్టాడు.

శోభనాద్రికి నిజంగా సమాధానం తెలియదు. ఏదో తప్పు రాసి పాసుమార్కు పోగొట్టుకోవడం యిష్టంలేని పొదుపరి, పిరికివాడూ కాబట్టి, ఆ ప్రశ్న వదిలేశాడు.

పేపర్లన్నీ రీనంబరింగ్ అయిన తర్వాత దిద్దడంకోసం ఎగ్జామినర్లకి పంపబడ్డాయి.

అయితే ఆయారామ్ — గయారామ్ ప్రభావం వల్ల బీరావు మంత్రివర్గం మారిపోయి, సీరయ్య ముఖ్యమంత్రి అయి కూర్చున్నాడు.




పరమేశం ముక్కుకు సూటిగా పోయే మనిషి. ప్రశ్నాపత్రంతోపాటు యిచ్చిన సమాధానాలు పక్కన పెట్టుకొని తనకొచ్చిన పేపర్లన్నీ టకటకా దిద్దిపారేశాడు. ముఖ్యమంత్రి 'ఎ' అన్న వాళ్ళందరికీ రైట్లు వేసి, యితర సమాధానాలు కొట్టిపారేశాడు.

రాజగోపాలం తెలివైన టీచరు. ముఖ్యమంత్రి ప్రశ్న దగ్గర కొచ్చేసరికి ఆలోచనలో పడిపోయాడు. పాత న్యూస్ పేపర్లు తీసి, పరీక్ష జరిగే రోజునాటికి, 'బి' ముఖ్యమంత్రిగా ఉన్నాడని నిర్ధారణ చేసుకొని, 'బి' రాసిన వాళ్ళందరికి రైట్లు పెట్టి, మిగిలిన సమాధానాలకి సున్నా చుట్టేశాడు.

ప్రకాశరావు ప్రస్తుతానికి ప్రాధాన్యత యిచ్చే స్వభావం కలవాడు. అతని దృష్టిలో ప్రస్తుతం అందరి నోళ్ళలో నలుగుతున్న

## ముఖ్యమంత్రి ప్రశ్న

సీరయ్య ముఖ్యమంత్రి అయితే 'సి' 'పి'కి మధ్య 'బి' వో వెలుగు వెలిగించాడని తెలియనివాడు. 'పి' సమాధానం వ్రాసిన వాళ్ళందరికి మార్కు యిచ్చేసి, మిగిలిన సమాధానాల్ని తప్పుపెట్టేశాడు.

పేపర్లు రివాల్యుయేషన్‌కోసం వచ్చినప్పుడు, మూడు విధాలుగా దిద్దబడిన ఈ ప్రశ్న ఆందోళన లేవదీసింది. ప్రధాన పరీక్షాధికారి రాష్ట్ర విద్యాసంస్థకి సలహా కోసం ఉత్తరం వ్రాశాడు. కాని ఆ సమయానికి అనుకోని అవాంతరాలవల్ల సీరయ్య పడిపోవడం, డీలయ్య ముఖ్యమంత్రి కావడం జరిగిపోయింది. 'మన రాష్ట్రానికి ముఖ్యమంత్రి డీలయ్యగారని మీకు తెలియకపోవడం చాలా విచారకరమైన సంగతి' అంటూ సంస్థ అధికారి గోడమీద సిల్లివాటంగా వ్రాసి పంపించేశాడు—డీలయ్యగారి మంత్రివర్గంలోని కొత్త విద్యామంత్రికి కోపంరాని విధంగా.

పరీక్షాధికారి ఒక నిర్ణయానికి వచ్చేశాడు. 'ముఖ్యమంత్రి ప్రశ్నకు ఏ బి పి డి లలో దేన్ని గుర్తుపెట్టినా మార్కులు యిచ్చేయండి. ఆ ప్రశ్న రాయనివారికికూడా ఒక మార్కు యిచ్చేయండి. ఎందుకంటే అది చాలా చిక్కుప్రశ్న. గజిబిజి ప్రశ్న. ఆ ప్రశ్న బదులు మరో ప్రశ్న ఉంటే విద్యార్థులకి న్యాయం కలిగేది' అని రివాల్యుయేషన్ బోర్డుకి సలహా యిచ్చేశాడు.

ఈ ముఖ్యమంత్రి ప్రశ్న — అన్ని సబ్జక్టులోనూ మంచి మార్కులు తెచ్చుకొన్నవాళ్ళకి ఏమీ సహాయం చెయ్యలేదు. ఆ ఒక్క మార్కువల్లా సాంఘికశాస్త్రంలో ప్యాసయి, మిగిలిన సబ్జక్టులలో మార్కులు తక్కువ వచ్చినవారికి సహాయకారికాలేదు. అయితే మిగతా అన్నిటిలో పాసుమార్కు తెచ్చేసి, సాంఘికశాస్త్రంలో ఒకమార్కు తక్కువొచ్చి, నష్టపోట్టు కొట్టుకుపోవడానికి సిద్ధంగా ఉన్న వో పదకొండువందలమందిని గట్టెక్కించేసి, కాలేజీలలో సీట్లకోసమో, పాట గడవడానికి ఉద్యోగాలకోసమో, పాట్లు పడేటట్టు చేసింది.

—'ఎలక్ట్రాన్'

(యిరుగు పొరుగు రాష్ట్రా రాజకీయాలాధారంగా)

8—10—71

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## పోలేరమ్మకి బాలుని బలి

చిత్తూరుకు చెందిన బకారా పేటలో పోలేరమ్మగుడిలో నో బాలుడిని ఎవరో బలి యిచ్చారట. గుడంతా రక్తమయంగా వుందట. మొండెం అక్కడే వున్నదటగానీ, తలమాత్రం దొరకలేదట. ఎవరు ఎవరిని బలియిచ్చారో యింకా తేలలేదట.

* * *

ఫ్రెంచి పాలిష్ త్రాగి ఖాపోలిలో 78 మంది ప్రాణాలను పోగొట్టుకున్నారట. షాహాపూరులో ఎనిమండుగురు అదే కారణాన్న చనిపోయారట. టాన్ పూరులో నాటుసారాయి త్రాగి ఆరుగురు చనిపోయారట.

## ధూమపానం—దుర్గుణాలు

వెస్ట్ జర్మని బాడ్‌హాంబ్స్ బర్గ్‌లో జర్మను వైద్య శాస్త్ర నిపుణులంతానూ సమావేశమై ఏకగ్రీవంగా పొగత్రాగుట తప్పు సుమా అన్నారట. ప్రొఫెసర్ కారల్ స్ట్రిరిన్ ఆసభలో మాట్లాడుతూ పొగత్రాగుట వలన మనిషికి సంతానోత్పత్తి సంబంధమైన శక్తి క్షీణించి పోతుందని అన్నారట, సిగిరెట్లు కాల్చువాడు కాల్చని వానికన్నా ఏడేళ్లు తక్కువ జీవిస్తాడని గొలుసుకాల్పు కాల్చేవారు, సిగిరెట్లు అసలే కాల్చని వానికన్నా 14 ఏళ్లముందు మరణిస్తారని అన్నారట. ఆయన 4, 372 పరీక్షలుచేసి యీవిషయాన్ని కనుగొన్నారట. 25 ఏళ్లుగా ధూమపానంలోనే యిల్లు కట్టుకొని ఆనక విసిగెత్తి 1964లో మానేసి నెపోలియన్ ఆఫ్ ఆంటీ స్మోక్ అను బిరుదునొందిన ప్రొఫెసరు లాథమ్, యల్. టెర్రీ, మాట్లాడుతూ పొగత్రాగే వారిలో 90 శాతం, మానేద్దామని ఎప్పుడూ అనుకుంటూనే వుంటారని వారిలో మూడొంతులు ఒక్కొక్కసారి మానేసి, ముహూర్తం కుదరక మళ్లీ మొదలెడుతూనే వుంటారని అన్నారట.




## పరిగెత్తే రైల్లో దోపిడి

మీరట్—ఢిల్లీ రైలుబండి షాహాబాద్‌నుంచి షహదారా స్టేషనుల మధ్య పరుగిడుతుండగా, ముఖానికి ముసుగులు ధరించిన కొంతమంది వ్యక్తులు క్రిక్కిరిసిన మూడవతరగతి ప్రయాణికుల పెట్టెలో జొరపడి, కత్తులతోనూ తుపాకులతోనూ బెదిరించి ఆరుగురివద్ద నుంచి చేతిగడియారాలు డబ్బు, నగలు ఊడలాక్కొని పరుగెత్తే రైలులోంచి దూకి అదృశ్యులైపోయారట. ఇదే స్వాతంత్ర్య చిహ్నం:

## తప్పిన ఆపద

కొత్తూరు చిన్న సముద్రానికి చెందిన 25 ఏళ్లరాజా అనే వ్యక్తి 9వ తేదీ రాత్రి రైలుపట్టాల మీద నడచి యింటికివస్తుండగా అతని కాలు పట్టాల మధ్య నున్న కర్రలో యిరుక్కొని ఎంత ప్రయత్నించినా రాలేదట, ఆ బిడ్జిమీద నిలబడి అతను సహాయం కోసం బిగ్గరగా అరవ నారంభించాడట. ఈ లోగా తిరుచ్చికి వెళ్లే తూత్తుకూడి ఎక్స్‌ప్రెస్ బండి వేగంగావచ్చి అతని మీదుంచి పోయిందట. బండి దగ్గరకు రాంగానే రాజా తనకాలునొప్పి కూడా లక్ష్యపెట్టక పట్టాల మధ్యనున్న కర్రంగుండా క్రిందికి ఒంగొండి పోయాడట. రైలు అల్లంతదూరం వెళ్లిన ఆనక అతను మళ్లీలేచి నించుని అరిచాడట. చుట్టు ప్రక్కల వాళ్లు బండిలోవారు లేచి అతన్ని కాలును విడిపించి అదే రైలులో తిరుచ్చి ఆసుపత్రికి తీసుకెళ్లారట.

## అనాథ బాలునికి 7 లక్షలు!

మళయాళ పండుగ ఓణంపేర కేరళ రాష్ట్రం వేసిన ఏడులక్షల లాటరీ మొదటి బహుమతి 22 ఏళ్ళ షాజీ అనే దాంగారుకు చెందిన నో అనాథ బాలునికి వచ్చిందట—దట్స్ హిజ్ లక్!!

## ఏపుట్టలో ఏపాముందో?

ఢిల్లీ మాలవ్యనగర్‌లో ఒకావిడ చాలాకాలం నుంచీ శారీరక, మానసిక బాధలను అనుభవిస్తోందట. అదేదో గ్రహాల మహాత్యమే అయ్యుంటుందని పక్కావిడ చెప్పగా 65 ఏళ్ల అశోక్ రాజా అనే జాతకాలుచూసే ఆయన వద్దకు వెళ్లమన్నదట. ఏపుట్టలో ఏపామున్నదో అనుకుని ఆమె, ఆమెభర్త అశోక్ రాజా వద్దకు వెళ్లారట ఆయన ఆమెను పరీక్షించి మీకూతురే మీయింటికి శని ఆమెను ఇంట్లోంచి వెళ్లగొట్టండి. అన్నాడట. దానికి ఆ తలిదండ్రులు ఒప్పనందువల్ల వారికతనో తెల్లకాగితం యిచ్చి, ఈ రాత్రి మీ ఆవిడకు విపరీతమైన పెద్ద కలలు వస్తాయి. అలా వస్తే ఆకలలు యీ కాగితంమీద రాసి నాకివ్వండి. మీఅమ్మాయిని నా దగ్గరకు పంపండి. ఆమెకున్న కీడుకు దులిపేస్తాను. అన్నాడట. ఆరాత్రి భయంతో ఆవిడకు పెద్దకలలే వచ్చాయట. తెల్లవారుతూనే తమ 14 ఏళ్ల కూతుర్ని ఆస్వామివద్దకు పంపేశారట, స్వామిగారు తలుపులువేసి, రజస్వలైనా కాని ఆ 14 ఏళ్ల పిల్లను బలవంతాన చెరచాడట. అతని బారినుంచి తప్పించుకు యింటికి వచ్చి ఆమెజరిగినది తన తలిదండ్రులతో చెప్పిందట. వారు పోలీసులకు చెప్తే పోలీసులు స్వామిగారింటికి వెళ్లేసరికి ఆయన అక్కడ మరో 16 ఏళ్ల పిల్లను చెరుస్తున్నాడట.

## తగ్గిపోతున్న తిరుపతి లడ్డు!

తిరుపతి ప్రసాదం లడ్డూ సైజు రానురాను తగ్గిపోతోందని, ఈ పద్ధతిలో లడ్డుసైజు చిక్కిపోతోందని హైకోర్టు ఉత్తరవు నిచ్చిందట.




* * *

**షిఫ్ట్ లుతో ఆనందం—పరిహారం !**

సిడ్నీలో — ఫ్యాక్టరీలలోనూ తదితరచోట్లా షిఫ్టుపద్ధతి మీద పనిచేసే వారు తమ షిఫ్ట్లు పనిచేస్తున్న సమయాలలో లేకపోవడం వల్ల వార్లు తమ యిళ్లల్లో సెక్సుకు సంబంధించిన ఆనందాన్ని పొందవలసిన స్థాయిలో పొందటం లేదని సమయంకాని సమయంలో విపరీతంగా శ్రమపడి రావడం వల్ల వారారకమైన వుత్సాహాన్ని కోల్పోతున్నారని, కనుక అట్టివారికి నష్టపరిహారంగా కొంచెం ఎక్కువ

## ఒకవారం విపరీతం

డబ్బు ఆ కంపెనీలవారు యివ్వాలని ఒక కమిటీకి నివేదించిందట. ఇది బాగుంది. ఎక్కువ డబ్బు యిస్తే లైంగిక సంబంధ ఆనందం పొందినట్లేనా వాటీజ్జిట్!

**కాబరే నృత్యం — సంస్థా కాంగ్రెస్ స్త్రీలకోరిక !**

కాబరే నృత్యం మన సాంప్రదాయానికి తగినది కాదని, కనుక ఆనృత్యాన్ని మనదేశంలోంచి తరిమి వేయాలని బెంగుళూరులో సిండికేటు కాంగ్రెసుకు చెందిన స్త్రీలంతా కోరారట. ఈ సమావేశంలో మాజీ ముఖ్యమంత్రి వీరేంద్రపాటిల్ కూడా కలిశారట. ప్రజారాజ్యమంటే అన్నిపనులూ ప్రజలే చేసా్త అవేవీ చెయ్యరాదు అని ప్రభుత్వాన్ని దుమ్మెత్తి పోయుడమా !

**పట్నాల్లో జనాభా పెరుగుదల !**

దేశ జనాభా తారాపథానికి వెళ్లిపోతోందని యిది పల్లెలలోగాక పట్నాలలోనే ఎక్కువగా కనుపిస్తోందని తత్ సంబంధమైన అధికారులన్నారట. నగరాలలోనూ, పట్టణాలలోనూ, 1951 సంవత్సరం 81 శాతం వుంటే 1961 లో అది




113 శాతమై యీ ఏటికి 142 శాతమై కూర్చున్నదట.

దేశంలో 2921 పట్టణాలున్నాయని, మొత్తం జనాభాలో 19.87 శాతం యీ పట్టణాలలోనే వుందని కూడా వారన్నారట.

* * *

రాష్ట్రపతి సతీమణి శ్రీమతి సరస్వతీ గిరి గారు ఇటీవల తమ భర్తతో సింగపూరు వెళ్లినప్పుడు మాంసాహారులతోబాటు కూర్చుని భోజనం చెయ్యవలసి వస్తుందని ఒక విందుకి వెళ్లటం మానేశారని వార్త.—

శ్రీమతి గిరి వైఖరిని వ్యాఖ్యానిస్తూ బ్లిట్స్ పత్రిక—ఇంతకుముందు అధ్యక్షులుగా ఉన్న, రాజేంద్రప్రసాద్, రాధాకృష్ణన్, జకీర్‌హుస్సేయిన్‌లని అనుసరించి శ్రీ గిరి కూడా విదేశీపర్యటనలో సతీసమేతంగా వెళ్లకపోవటం మంచిది, అని సూచించింది. ... ●





# నన్ను క్షమించవూ!



'మెనీ మెనీ హాపీ రిటర్న్స్' అంటూ నేను తెచ్చిన ప్రజంటేషన్‌కు జయకు అందించాము.

'థాంక్స్, అంకుల్!' అంటూ స్వీకరించింది జయ.

'మొత్తమ్మీద మీపాపకు బాగా ట్రయినింగ్ ఇచ్చావోయ్' అన్నాను ప్రక్కనే వున్న మాధవరావుతో.

'ఆ క్రెడిటంతా వాళ్ళమ్మదే సార్! అయినా దీనికసలు చిన్నప్పట్నుంచీ పెద్దలంటే గౌరవం ఎక్కువండి' అన్నాడు మాధవరావు.

'ఏమ్మా, నిజమేనా?' అని నేను అడిగేసరికి 'అవును' అంది జయ ప్రతి అక్షరాన్ని నొక్కి పలుకుతూ.

'నా టీగర్!' అంటూ నవ్వుతూ బుగ్గమీద చిటికె వేసేసరికి సిగ్గుపడి లోపలికి పారిపోయింది

'ఏమైనా నీవు పిల్లల్ని పెంచటంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొంటున్నావోయ్! అందుకు నిన్ను అభినందించాలి!' అన్నాను మాధవరావు భుజం తట్టుతూ.

'వారు పెద్దయ్యాక మనల్ని ఆదరించినా, అసహ్యించుకొన్నా, వారిని సక్రమమైన పద్ధతిలో పెంచటం మన బాధ్యత కదండీ?'

'అవునవును' అన్నాను అప్రయత్నంగా.

'రండిసార్! ఇప్పటికే చాలా ఆలస్యమైంది' అంటూ నన్ను ప్రక్కగదిలోకి తీసికెళ్ళాడు. గది చూడటానికి చిన్నదైనా చక్కగా అలంకరించబడి వుంది. గది మధ్యలో అమర్చబడిన టేబుల్ చుట్టూ నాల్గు కుర్చీలు వేసున్నాయి. నేను కుర్చీలో కూర్చున్నాక మాధవరావు లోపలికెళ్ళాడు.

గోడలకు ప్రకృతి దృశ్యాలు కల రంగురంగుల కాలెండర్లు వ్రేలాడుతున్నాయి. ఆ గదిలోనే వో ప్రక్కగా ఉన్న అల్మారాలో రకరకాల బొమ్మలు నన్ను బాగా ఆకర్షించాయి. గాజు తలుపులోంచి బయటకు కన్పడేట్టుగా అమర్చిన ఆ బొమ్మలు చాలా అందంగా కన్పించాయి నా కంటికి. ముఖ్యంగా వాటిల్లో వేంకటేశ్వరస్వామి విగ్రహం గౌతమబుద్ధుని విగ్రహం నన్ను అమితంగా ఆకర్షించాయి. కళాకారుడెవ్వరో కాని తన హస్త నైపుణ్యాన్ని చాకచక్యాన్ని ఆ విగ్రహాల్లో చక్కగా చూపించాడు. వాటికి ఉపయోగించిన రంగులు కూడా ఆ

రూపాలకు మించి విందుదొరాన్నిచ్చాయి. ఆ క్షణంలో నాకు వినోద్ ఇంట్లో చూసిన వర్ణచిత్రాలు గుర్తుకు వచ్చాయి.

ఒకసారి నేను వినోద్ పుట్టినరోజు పండక్కి వాళ్ళింటికెళ్ళాను. మాధవరావు లానే అతను కూడా నన్ను వో ప్రత్యేకమైన గదిలోకి తీసికెళ్ళాడు. విశాలమైన ఆ గదిలోవున్న సోఫాలు, ఖరీదైన కుర్చీలు, డన్‌లప్ పిల్లోస్, కిటికీలకు, గుమ్మాలకు వ్రేలాడుతున్న సిల్కు కర్టన్స్, గోడలకు వ్రేలాడుతున్న వర్ణచిత్రాలు, పాశ్చాత్య సంగీతాన్ని ఆలాపిస్తున్న ఫారిన్ ట్రాన్సిస్టర్... ఏదో కృత్రిమ లోకాన్ని స్ఫురింపజేశాయి. కాని ఇక్కడి వాతావరణం మాత్రం అందుకు పూర్తిగా విరుద్ధంగా వుంది.

కేవలం వారి వారి ఉద్యోగాలలోనే కాక మనస్తత్వాలలోకూడా వినోద్‌కు, మాధవరావుకు ఎంతో వ్యత్యాసం వుంది.

వినోద్ కూడా నాలానే ఆఫీసర్! అతని విగ్రహానికి, అందానికి తోడు గొప్ప టీవి కూడా వుంది. వేసే ప్రతి అడుగూ గంభీరంగా వేయటానికి చూస్తాడు. సాధ్యమైనంత ఆడంబరంగా కన్పడటానికి ప్రయత్నిస్తాడు.

కాని మాధవరావులో అలాంటి లక్షణాలేవీ కన్పించవు.

అతను తన దగ్గరే పనిచేసే ప్యూనో ! అందర్నీ చిరునవ్వుతో పలకరిస్తాడు. సౌమ్యంగా మాట్లాడుతాడు. సాధ్యమైనంత నిరాడంబరంగా కన్పించటానికి ప్రయత్నిస్తాడు. అందుకనే మాధవరావంటే ఆఫీసులో అందరికి ఇష్టం.

'సారీ సర్ ! కొంచెం ఆలస్యమైంది' అంటూ ప్రవేశించి చేతిలోవున్న ఫలహారం పళ్ళాన్ని నా ముందుంచాడు మాధవరావు.

ఒకసారి ఆ పళ్ళెంవైపు పరిశీలనగా చూశాను.

బందరులడ్డు...జిలేబి చుట్టలు...కారపు బూంది...పకోడి...

'ఇవన్నీ నేను తినాల్సిందేనా?' అని అడి

ఐతేనారే! అన్నీకలిపి ఐదు ఐటమ్స్ లేవుకదండీ!' అనేసి లోపలికెళ్ళాడు రావు.

సారి పళ్ళెంవైపు చూసిన నాకు చిన్న స్పోర్ట్స్‌లోని ఐటమ్స్ గుర్తు

# నన్ను క్షమించవూ!

కొచ్చాయి.

జీడిపప్పు కట్‌లెట్స్, ఏపిల్ ముక్కలు, బిస్కట్స్...

ఫలహారం చేయటం మొదలుపెట్టాను.

పేరుకుమాత్రం రెండూ పుట్టినరోజు పండుగలే!

రెండు ఆతిథ్యాలే!

కాని ఆతిథ్యమిచ్చిన తీరులోనే తేడా వుంది.

పెట్టిన ఐటమ్స్‌యొక్క విలువ ఎక్కువా? తక్కువా ? అని ఆలోచించటం అవివేకం! ఆ ఆతిథ్యం వెనుక దాగున్న హృదయ పూర్వకమైన ఆదరణకే ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వాలి!

'ఇంకో స్వీట్ తీసుకురమ్మంటారా?' అంటూ వచ్చాడు మాధవరావు.

'నో...నో... థాంక్స్! ఇప్పటికే కడుపు నిండిపోయింది' అంటూ మంచినీళ్ళు త్రాగాను. మాధవరావు తన చేతిలోవున్న స్టీల్‌గ్లాసును టేబుల్‌మీద పెట్టి 'తీసుకోండి!' అన్నాడు.

'మళ్ళీ ఆదేమిటోయ్?'

'మరేంలేదు ! మీకు స్పెషల్‌గా కీర్ చేయించాను' అన్నాడు నవ్వుతూ.

'నీతో పెద్ద చిక్కు వచ్చి పడిందయ్యా! ఏదో పాపం పుట్టినరోజని పిలిస్తే వచ్చాను. కాని ఇంత అట్టహాసం చేస్తావనుకొంటే రాకపోదును' అంటూనే గ్లాసు నందుకొన్నాను. మాధవరావు నవ్వుకొంటూ లోపలి కెళ్ళాడు.

మాధవరావిచ్చిన 'కీర్'ను తాగుతుంటే ఆనాడు వినోద్ ఇచ్చిన వాట్ 69 కంటె ఎంతో మధురంగా వున్నదనిపించింది.

నిజానికి ఆనాడు వినోద్ ఇచ్చిన విందు కంటె నేడు మాధవరావిచ్చిన విందే ఇటు శరీరానికి, అటు మనస్సుకు ఎంతో తృప్తిని కల్గించింది.

'నమస్కారం బాబూ' అన్నమాటలు విన్పించగానే సిగరెట్ వెల్గించుకొంటున్న నేను తలెత్తి చూశాను.

నిర్మలంగా నవ్వుతున్న మాధవరావు, అతని ప్రక్కనే నిలబడి తనకు చేతులు జోడిస్తున్న వో వృద్ధుడు కన్పించారు.

ప్రతి నమస్కారం చేస్తూనే వివరమన్నట్టు మాధవరావువైపు చూశాను.

'మా నాన్నగారు' అన్నాడు.

నీరు కావిపంచె...నన్నటిస్లైను బనీను...నేత తుండు...జీవితం తాలూకు అనుభవాలు అతని ముఖంలోని ముడతల్లో దాగి వున్నాయి.

ఏదో అనిర్వచనీయమైన సంతృప్తి, ప్రశాంతత అతని కళ్ళల్లో గోచరించాయి. ఆ క్షణంలో నాకు మూడునెలల్కితం నన్ను చూడటానికివచ్చిన 'నాన్న' గుర్తుకు వచ్చాడు. నాన్నకూడా ఇంచుమించు అదే వయస్సు వుంటుంది. కాని నా తండ్రి ముఖంలో ఈ సంతృప్తి, ప్రశాంతత నాకెప్పుడూ కన్పించలేదు. అంతులేని అసంతృప్తి ఆయన కళ్ళల్లో కన్పించేది.

'ఏంటి బాబూ. ఆలోచిస్తున్నారు?' అని ప్రశ్నించాడు ముసలాయన.

'మరేం లేదు!'అన్నట్టు 'మీరు ప్రస్తుతం ఇక్కడే వుంటున్నారా?' అని అడిగాను.

'అవును బాబూ! మా చిన్నోడు కూడా జబల్‌పూర్లో రయిల్వేలో చేస్తున్నాడు. ఆడుకూడా నన్ను తనదగ్గరకు రమ్మని ఎన్నో ఉత్తరాలు రాస్తున్నాడు. ముందు నుంచీ పల్లెటూరి జీవితానికి అలవాటుపడిన నాకు ఇక్కడ వుండాలంటే నే కొత్తగా వుంది. వద్దన్నా యినకుండా ఉన్న యింటిని కాస్తా అమ్మించేసి ఈ మాధవే నన్నిక్కడకు రప్పించాడు' అన్నాడు.

'అయితే మీ నాన్నగారు ఏడిపార్టుమెంట్లో పనిచేశారు?' అని అడిగాను.

మాధవరావుకు అవకాశం ఇవ్వకుండానే ముసలాయనే చెప్పటం ప్రారంభించాడు.

'నేనేమీ ఉద్యోగాలు చేయలేదండి. ఏదో మా అయ్య జేర్పిన విద్దెనే పట్టుకొని కాగితం గుజ్జుతోను, మట్టితోను బొమ్మలు చేసేవాణ్ణి...'

'మా నాన్నగారు చేసిన బొమ్మలు చూద్దురుగాని రండి' అంటూ అల్మారా వైపు నడిచాడు మాధవరావు.

'హోహో! ఇవన్నీ మీరు చేసినవేనా? నేను రాగానే చూశాను! చాలా బాగున్నాయి!' అన్నాను.

'ఏమిటో బాబూ. నాకు ఇప్పటికి వోపిక చావలేదురా అంటే యీ మాధవాడు యినటం లేదు. ఇంతవరకు నీవు పడ్డ శ్రమ

ఆ చక్కని,
పరిశుభ్రమైన తెల్లదనానికి

# ఓ ఓ బి
# నీలి

ఓ.ఓ.బి నీలి నీటిలో అతి సులభంగా, పూర్తిగా కరుగుతుంది. తెల్లటి దుస్తులకి సమమైన మంచులాంటి తెల్లదనాన్నిస్తుంది. మీ చొక్కాలకు, చీరలకు, దుప్పట్లకు మరియు ఇతర బట్టలకు అధికమైన తెల్లదనాన్నివ్వడానికి ఇదే అతి పొదుపైన పద్ధతి. నీలపు మరకలుండవు. పసుపు రంగుగా మారదు.

ఓ ఓ బి నీలి భారతదేశంలోకెల్లా పెద్దదైన, ఆధునికమైన ఫ్యాక్టరీలో పశ్చిమ జర్మనీవారి సహకారంతో తయారుచేయబడుతున్నది.






తయారుచేయువారు:
**అల్ట్రామెరైన్ పిగ్మెంట్స్ లిమిటెడ్** అంబత్తూరు, మద్రాసు-53

UPL/6548

లు; ఏదో కృష్ణా, రామా— అంటూ హాయిగా కూర్చో—అంటున్నాడు' అన్నాడు ముసలాయన తృప్తిగా.

'మీరు చాలా అదృష్టవంతులు' అన్నాను నేను.

పైకి మాత్రం అలా అనకల్గానే కాని నా హృదయంలో మాత్రం తుఫాను ప్రారంభమయింది.

'అమ్మాయి పండుకునే టైమయింది! నే వెళ్ళి జోకొడితేకాని నిద్రపోదు! వస్తా బాబూ!' అంటూ లోపలి కెళిపోయాడు ముసలాయన.

'మిస్టర్ మాధవరావ్! థాంక్యూ ఫర్ యువర్ పార్టీ' అంటూ భారంగా లేచాను.

'అసలు ఇలాంటి వేడుకలంటే నాకిష్టం లేదండి. మా నాన్నగారి బలవంతంచేతనే ఈ ఫంక్షన్ చేశాము. మీరు వచ్చి, మీ విలువైన ఆశీస్సులను మా జయకు అందజేసినందుకు చాలా థాంక్సండి' అన్నాడు మాధవరావు.

'అచ్ఛా! వస్తా మరి!' అంటూ కారు స్టార్టు చేశాను

నేను ఇంటికి చేరేసరికి తొమ్మిది దాటింది. అప్పటికే పిల లిద్దరూ నిద్రపోతున్నారు. రేణుక మాత్రం ఏదో నవల చదువుతూ కూర్చుంది. నేను బట్టలు మార్చుకొన్నాక 'మీకేదో కవరు వచ్చింది'

## నన్ను క్షమించవా!

అంటూ ఓ కవరును తెచ్చి యిచ్చింది రేణుక.

కవరు చింపాను.

'అన్నయ్యా!

ఇక్కడ నాన్న పరిస్థితి ఏమీ బాగుండ లేదు. ఎన్ని ఉత్తరాలు రాసినా నీవు మాత్రం సమాధానం రాయటంలేదు! నన్ను మర్చిపోతున్నందుకు నేనేమీ బాధపడటం లేదు. కాని నాన్న పరిస్థితిని తల్చుకొంటేనే నా గుండె పగిలిపోతూంది. నీ దగ్గర్నుంచి రాగానే నాన్న మంచమెక్కాడు. ఇరుగు పొరుగువారి సహాయంతో డాక్టర్కు చూపించాము. మందులు వాడుతున్నప్పటికీ ఆయనకు ఆరోగ్యం చిక్కలేదు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ పరధ్యాన్నంగా వుంటున్నాడు ఆహారం విషయంలో గాడా శ్రద్ధ చూపించటం లేదు. నానాటికీ ఆయన ఆరోగ్యం క్షీణించిపోతూంది. మానసికంగా ఆయన బాధపడుతున్నారని డాక్టర్గారంటున్నారు. నా మీద కాకపోయినా, నాన్న మీద నీకేమాత్రం ప్రేమనేది మిగిలివుంటే వెంటనే బయల్దేరి వస్తావని ఆశిస్తాను—వాసు.'

నా హృదయం బరువెక్కింది.

'నాన్నా!' అంటూ దీర్ఘంగా నిట్టూర్చాను.

'అన్నం వడ్డించాను, రండి' అంటూ పిల్చింది రేణుక.

'ఈ పూట నేను భోంచేయలేను రేణూ!' అన్నాను బరువుగా.

'కొద్దిగా తినండి.'

'నాకు ఆకలిగా లేదు.'

'పోనీ 'బోర్న్‌విటా' తీసుకురమ్మంటారా?'

'అక్కర్లేదు.'

'ఏమి తీసుకోకపోతే ఎలాగండి?'

'రేణుకా! ప్లీజ్! నన్ను విసిగించకు!' అని చిరాకుగా అన్నాను.

రేణుక మారు మాట్లాడకుండా వంటింట్లోకి వెళ్ళిపోయింది.

నేను లైట్ తీసేసి బెడ్‌మీద వాలిపోయాను.

కళ్ళు మూసుకొన్నానన్న మాటే కాని నిద్ర రావటంలేదు.

నా మనస్సంతా ఆలోచనలతో నిండిపోయింది,

వాసు అంత విషాదంగా ఉత్తరం రాస్తాడని నే నెప్పుడూ ఊహించలేదు.

నిజానికి వాసు అలా రాయటానికి కారణం నా ప్రవర్తనే!

వాడు ఎన్ని ఉత్తరాలు రాసినా తను సమాధానం రాయకపోవటం నేరమే!

ఆమాత్రం రాసే తీరిక, వోపిక తనకు లేదా?

కన్నతండ్రి యోగక్షేమాన్ని పరామర్శించలేని కఠినహృదయుడాతను?

తన అదృష్టానికి తన ఉన్నతస్థితికి మూలకారకుడు తన తండ్రే!

రాత్రనక, పగలనక వ్యవసాయం పనిచేసి డబ్బు సంపాదించాడు నాన్న.

అదంతా ఎవరికోసం?

పట్టుదలతో తనను ఎమ్. ఏ వరకు చదివించాడు! కూతుర్ని చేసుకొంటే ఆఫీసర్ పోస్టు యిప్పిస్తానన్న ధనరాజుగారికి అల్లుణ్ణి చేశాడు.

అలాంటి తండ్రికి తనెంతో ఋణపడి వున్నాడు.

కాని తనేం చేస్తున్నాడు?

పట్నంలో జీవితం కావాలని కోరుకుంటున్న తండ్రిని బలవంతాన స్వంత వూళ్ళోనే బంధించి ఆయన మనస్సును క్షోభ పెడుతున్నాడు!






తనొక ఆఫీసరు తండ్రినని నల్గురిలో తిరుగుతూ చెప్పుకోవాలని ఉబలాటపడుతున్న ఆయన కోర్కెను అణిచివేస్తున్నాడు తను!

హే భగవాన్ ?

నన్నింత నిస్సహాయంగా ఏందుకు సృష్టించావ్?

అసలు నాన్న మానసికంగా బాధపడటానికి కూడా కారణం తనేనేమో?

ఇక్కణ్ణుంచి వెళ్ళాకనే నాన్న మంచాన పడ్డాడని రాశాడు నాను.

తప్పకుండా నాన్న అనారోగ్యానికి కారణం తనే!

తనవలనే ఏదో పొరపాటు జరిగి వుంటుంది,

ఒకవేళ ఆరోజు సాయంత్రం వినోద్ అన్నమాటలు నాన్నకు వినిపించాయేమో?

అవును...

ఆ మాటల్ని నాన్న వినివుంటాడు.

నా కళ్ళముందు ఆ సాయంత్రం మెదిలింది.

నేను హాల్లో కూర్చొని ఏదో పుస్తకం చదువుతుండగా నాన్న ఓ కప్పుతో కాఫీ తెచ్చి తన కందించాడు.

'అదేమిటి నాన్నా? పిల్లలున్నారు! రాముడున్నాడు! కాఫీ నువ్వు తెచ్చావేమిటి ?' అని అడిగాను.

'ఎవరు తెస్తే ఏముందిలేరా! రాముడు బజారెళ్ళాడు. పిల్లలేమో ఆడుకొంటున్నారు అమ్మాయేమో వంటచేస్తూంది' అన్నాడు.

'నీవు కాఫీ తీసుకొన్నావా?' అని అడిగాను కప్పును టీపాయ్‌మీద పెడ్తూ.

'నేను తీసుకొంటాను కాని ముందు నువ్వు కాఫీ త్రాగు! చల్లారిపోతూంది!' అన్నాడు.

'అలానే!' అంటూ కాఫీ త్రాగుతుండగా వినోద్ వచ్చాడు.

ప్రక్కనే చేతులు కట్టుకొని నిలబడివున్న నాన్నవైపు పరీక్షగా చూశాడు వినోద్.

వదులుగా వ్రేలాడుతున్న పిలంరంగు చొక్కా...కాకీలాగు ... తెల్లటి మీసాలు ... గళ్ళతుండు...

వినోద్ ఆయనరూపాన్ని పరిశీలించి చూస్తున్నాడని తను గమనించి చిన్నగా దగ్గి నాన్నవైపు తిరిగి 'ఈ కప్పు లోపలికి తీసి కెళ్ళి వినోద్‌కూడా ఓ కప్పు కాఫీపట్రా!'

అన్నాను.

నాన్న వెంటనే టేపాయ్‌మీద తను వదిలేసిన కప్పును పుచ్చుకొని లోపలికెళ్ళాడు.

'వ్హాట్, బ్రదర్? ఇంకో కొత్త సర్వెంట్‌ను పెట్టుకొన్నట్టున్నావ్? రాముడేయ్యాడు? ఏమైనా మనుష్యులకు ఆశ్రయమిచ్చేముందు అన్ని విధాల ఆలోచించాలి. సిటీస్‌లో మరీ రాస్కెల్స్ ఎక్కువైపోతున్నారు. మనిషియొక్క అప్పియరెన్స్ చూసి మనం మోసపోగూడదు!' అన్నాడు.

నేనేదో మాట్లాడాలనుకొన్నాను! కాని నోరు పెగల్లేదు!

వినోద్‌కు తన తండ్రిని పరిచయం చేయమని అంతరాత్మ ఆదేశించింది. కాని మనస్సు అందుకు అంగీకరించలేదు. నేను వినోద్ ఇంటికి ఒకసారివెళ్తే అతను తనకు అతని తండ్రిని పరిచయం చేశాడు. రిటైర్డ్ జడ్జీగారని ... లైన్స్ క్లబ్ సెక్రటరీ...అని... ఆయన చేసిన పదవులను గురించి చెప్పాడు. కాని ఏ పదవులూ లేని యన్ని 'తండ్రి' అని చెప్పుకోవటం ఎలా? తన తండ్రి రూపాన్నిచూసి 'సర్వెంట్' అయివుంటాడని ఊహించిన వినోద్‌కు ఆయనే తన తండ్రని చెప్పటం ఎలా?

'మీ తండ్రిగారేం చేసేవారు?' అని అతను ప్రశ్నిస్తే 'కార్పెంటర్!' అని తనెలా సమాధానం చెప్పగలడు?

తనొక కార్పెంటర్ కొడుకునని తెలిస్తే వినోద్ తనను చులకనగా చూస్తాడేమో?

'వ్హాట్ బ్రదర్? ఏమిటీ ఆలోచిస్తున్నావ్? మన ప్రోగ్రాంకు టైమయింది. అక్కడ మనవాళ్ళంతా మనకోసం వెయిట్ చేస్తుంటారు. క్విక్! త్వరగా తయారవ్వు!' అని తొందర పెట్టాడు వినోద్.

నాన్న కప్పుతో కాఫీతెచ్చి టీపాయ్‌మీద పెట్టేసి వెళ్ళిపోయాడు ... కన్నతండ్రిని స్నేహితునికి పరిచయం లేని అసమర్థుడు తను.

మట్టితో బొమ్మలు చేసుకొని బ్రతికిన తండ్రిని ఎంతో గర్వంగా తనకు పరిచయం చేశాడు మాధవరావు.

తను పరిచయం చేయకపోగా వినోద్ తండ్రిని చూసి సర్వెంటని భ్రమపడి, కాదని నోరువిప్పి చెప్పలేకను. అలా చెప్పే ధైర్యంకాని సమయ స్ఫూర్తిగాని తనకు లేకపోయాయి.

# నన్ను క్షమించవూ!

నాన్న తప్పకుండా వినోద్ మాటలు వినే వుంటాడు.

ఎంత అపచారం జరిగింది?

తన తండ్రిని... తనకు ప్రాణంపోసిన తండ్రిని... తనకు రూపాన్నిచ్చిన తండ్రిని ...తన నొక ప్రయోజకుణ్ణి చేసిన పుణ్యమూర్తిని... తను అవమానించాడు.

ఆ క్షణంలో తనెందుకలా ప్రవర్తించాడు.

స్నేహితుని ఎదుటే కన్నతండ్రితో, కప్పులు తీయించటానికి తన మనస్సెలా అంగీకరించింది?

తన చదువు, సంస్కారం ఆక్షణంలో ఏమైపోయాయి? నిస్వార్థహృదయంతో తనకోసం ఎన్నోబాధలు పడిన తన తండ్రికి తను చూపిన కృతజ్ఞత ఏమిటి?

'ఆనందం' అని ముద్దుగా పిల్చుకొంటున్నందుకు ప్రతిఫలంగా తను పితృ హృదయానికి కల్గించే ఆనందం ఏమిటి?

తండ్రికి తను తీరని ...ం చేశాడు...

వెంటనే వెళ్ళి చేసిన తప్పుకు క్షమాపణ చెప్పుకోవాలి!

రేపే వెళ్ళాలి—

నాన్నను కల్సుకోవాలి—

—అలా ఆలోచిస్తూనే నిద్రపోయాను!

* * *

ఊరుదగ్గర పడుతున్నకొద్దీ నాలో ఆత్రం అధికమైంది!

నా రాకకు వాసు ఎంతో సంతోషిస్తాడు!

తనమీద ఏర్పరచుకొన్న అపోహలన్నీ తొలగిపోతాయి.

వాసును తీసుకొచ్చి బాగా చదివించి తనలాంటి ఆఫీసర్‌ను చేయాలి! నాన్నను తీసుకొచ్చి మంచి నర్సింగ్‌హోమ్‌లో చేర్పించాలి! ఎంతడబ్బు ఖర్చయినాసరే మంచి ట్రీట్‌మెంట్ ఇప్పించాలి! తనంటే నాన్నకు తిరిగి అభిమానం కల్గేటట్టు చేయాలి! మాధవరావు తండ్రిముఖంలో తను చూసిన సంతృప్తి ఇంతకాలం కరువైన అనురాగం, ఆప్యాయత, ఆదరణ ఆయనకు లభింపజేయాలి!

ఆ వ్యథిత హృదయాన్ని తన అమృత జల్లులాంటి ప్రేమపూర్వక వచనాలతో సంతోషపెట్టాలి!

నా ఆలోచనలకంటె వేగంగా పరిగెత్తింది కారు!

మా ఇల్లు రాగానే కారాపాను!

కార్లోంచి దిగుతున్న నన్ను చూసి జనం పోగయ్యారు!

వాళ్ళందర్నీ తప్పించుకొని లోపలికెళ్ళాను.

ఆ దృశ్యాన్ని చూడగానే నా శరీరం భయంతో కంపించిపోయింది.

గడ్డిమీద పడుకోబెట్టిన నాన్న శరీరం—

ఆయన కాళ్ళ దగ్గరే ఏడుస్తూ పడున్న వాసు—

విజయగర్వంతో నాన్న తల వెనుక వెల్గుతున్న దీపం—

'నాన్నా!' అంటూ గట్టిగా అరిచాను.

అంతే!

మరుక్షణంలోనే నా శరీరానికేదో చేతి స్పర్శ తగిలింది.

కళ్ళు విప్పి చూశాను.

'ఏమిటండీ, అలా గావుకేక పెట్టారు?' కంగారుపడుతూ లైటు వేసింది రేణుక.

కళ్ళు నలుముకొని చూశాను.

ఎదురుగా రేణుక కన్పించింది!

ప్రక్కనే మంచమ్మీద పండుకొన్న పిల్లలు కన్పించారు!

నా మనస్సు కుదుటపడింది.

నా హృదయానికి ధైర్యం చిక్కింది.

'రేణూ! మరేమీ కంగారుపడకు! ఏదో పీడకల వచ్చింది! అన్నట్టు...రేపు అర్జంటుగా మా వూరు వెళ్ళాలి...కొంచెం పెందలాడే లెగ్గొట్టు...' అన్నాను.

'అలాగే!' అంటూ లైటుతీసి పండుకొంది రేణుక.

'నాన్నా! నన్ను క్షమించవూ!' అనుకొంటూ మెల్లగా కళ్ళు మూసుకొన్నాను.●

# మీరు బలహీనముగా వున్నప్పుడు, మీకు దగ్గు జలుబులు వదిలేటట్లు కనిపించదు




మీ శరీరపు రోగ నిరోధక శక్తి తక్కువయినప్పుడు మీకు దగ్గు జలుబులు పట్టుతాయి. అవి వదిలే టప్పటికి మీకు మరింత బలహీనత కలుగుతుంది. దానివలన మళ్ళీ మళ్ళీ దగ్గు జలుబులు వస్తూనే వుంటాయి. కాని ఇంత పని అగుతుందా? గృహిణి జబ్బు చేసి పడుక్కుంటే ఎల్లాగ?

దీనికి పరిహారమేమిటంటే, దగ్గు జలుబులను ఎదుర్కొనేటప్పుడే, బలహీనతను కూడా పోగొట్టుకోవాలి. ఎర్ర లేబుల్ కల వాటర్‌బరీస్ కాంపౌండ్ మాత్రమే ఈ రెండు పనులను ఒకే సమయములో చేయగలదు.

ఎర్ర లేబుల్ గల వాటర్‌బరీస్ కాంపౌండ్‌లో రెండు రకాల పదార్థములు వున్నవి. దానిలో కల క్రియోసోట్ మరియు గయకాల్, దగ్గు జలుబులకు ఉపశమనము నిచ్చును. ఇంకా దానిలో గల శక్తి వర్ధకమైన పదార్థములు బలహీనతను పోగొట్టి, శక్తిని చేకూర్చి రోగ నిరోధక శక్తిని పెంపొందించును.

ఎర్ర లేబుల్ కల వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగి దగ్గు జలుబుల నుండి విముక్తి పొందండి.

ఇప్పుడు 2 సైజులలో లభిస్తోంది.

శక్తి, ఆరోగ్యమును నిలబెట్టుకొనుటకు...

## వాటర్‌బరీస్ కాంపౌండ్

ఎర్ర లేబుల్

— అత్యంత నమ్మకమైన కుటుంబ టానిక్

వార్నర్-లాంబర్ట్ వారి ఉత్కృష్టమైన తయారీ



# ఈదారెక్కడికి?

మహీధర రామమోహనరావు

సీరియల్

## జరిగిన కథ

పెళ్లయిన కొన్నాళ్లకే జానకి భర్త ఏమై పోయాడో తెలియలేదు. జానకి మాత్రం గుండె రాయి చేసుకుని బొంబాయిలోనే స్థిరపడిపోయింది. ఆమె కొడుకు రవీంద్ర. రెండు దశాబ్దాల తర్వాత ఆ వూళ్లో అడుగు పెట్టింది జానకి. సత్యానందం గారింటికి వెళ్లింది. భద్రక్కగాని, సత్యానందం గాని ఆమెని గుర్తు పట్టలేక పోయారు. తెలిసిం తర్వాత సంతోషం పట్టలేక పోయారు. ఆ వూళ్లో జరిగిన ఒక ఆందోళన మూలంగా జానకికి తన భర్త జ్ఞాపకం వచ్చాడు. భద్ర ఆమెని వోదార్చింది. భర్తవైపు బంధువులను చూడటానికి కాకినాడ వెళ్లిన జానకి రవీంద్రలను ఆస్తిలో వాటాకోసంవచ్చారనుకున్న బంధువులు అందుకు రాలేదని తెలుసుకున్నప్పుడు నిశ్చేష్టులవుతారు. మనుమడు రవీంద్రకి స్థిరాస్తిగా కొంత పొలం యివ్వటానికి నిశ్చయించుకుంటాడు కుమారస్వామి. సత్యానందం కొడుకు రామకృష్ణ వచ్చాడని తెలిసి జానకి, రవీంద్ర, భద్రయింటికి బయలుదేరారు. చదువుకుంటున్న రామకృష్ణ నక్సలైట్లతో చేరతానంటాడు.

## 18

వాళ్ళు ముగ్గురూ గుమ్మంలోకి వెళ్ళబోతూండగానే, గేటు తలుపులు తీసుకొని ఎవరో వెనకనుంచి నెట్టుకుని వస్తున్నట్లు డాక్టరు రంగనాయకులు తూలిపోతూ వరండాలోకి వచ్చేసేడు. వస్తూనే ఉపోద్ఘాతం ఏమీ లేకుండానే క్షమార్పణ విని పించేడు.

'క్షమించాలి. సత్యానందంగారూ! మిమ్మల్నడక్కుండా...'

అతని స్థితి చూసి సత్యానందం తనను డక్కుండాచేసిన అపరాధం గురించి ఆనక్తి బరచలేదు.

'ఈ గాలీ వర్షంలో ఎక్కడినుంచి వస్తున్నావు? ఆ బట్టలేమిటి? వళ్ళంతా మిటి? క్షమించమని అడగడానికి ఇంత ...

జానకికోసం వెనక తిరిగి చూసేడు. వీధిలోకి బయలుదేరుతున్న వారికోసం కాఫీలు తీసుకొని ఆమె వస్తూంది. సత్యానందం రంగనాయకులును కూర్చోబెట్టి ఒక కప్పు చేతికిచ్చేడు.

'ముందిది తాగు. తరవాత చెప్పు.'

రంగనాయకులు తాను వచ్చిన పని చెప్ప బోవడం, సత్యానందం గద్దించి కాఫీ గుర్తు చేయడంతో మరి వూరుకొన్నాడు. కాఫీ తాగి కప్పు క్రిందపెట్టేడు.

'థేంక్సు.'

'ఇప్పుడు చెప్పు. నాకు నువ్వేం అపకారం చేసేవో ఎందుకు ఆ క్షమార్పణ చెప్పుకో వలసివచ్చిందో.'

'మీకుగాని, హెడ్మాస్టరుకుగాని చెప్ప కుండా హైస్కూలు బిల్డింగు తాళాలు బద్దలు కొట్టేశాను...'

తాను ఏమంటాడో వినడానికి రంగనాయకులు మాట నిలిపేడని గ్రహించి సత్యానందం వూరుకొన్నాడు.

'ఎందుకని అడగరేం?'

సత్యానందం నవ్వేడు.

'చెప్పు.'

'హరిజన పల్లెలవాళ్ళని తీసుకొచ్చి అందులో ప్రవేశపెట్టేను. ఆఖరు బట్టు కూడా వచ్చేరు. నేనిల్లా వస్తున్నాను.'

సత్యానందం కళ్ళనీళ్లు వచ్చేయి.

'నేను చేసివుండవలసిన పని నువ్వు చేసేవు. నిన్ను క్షమించడ మెందుకయ్యా!'

పోర్రాత్రివేళ జాన్ని మోసుకొని నలుగురు కుర్రవాళ్ళు క్లినిక్‌కు వచ్చి లేపేరు. అతనిపాక కూలిపోయింది. అదివరకే ఆకు లెగిరిపోయాయట. పెద్ద దెబ్బలు తగల లేదు. కాని, పాతగాయాలు. మనిషి పడి పోయేడు.

అతనిని సర్దేసరికి మరో ఇద్దరు పల్లె నుంచి వచ్చేరు. వాళ్ళంతా కొంపలుపోయి నెమ్మదిగా వూళ్లోకి రావడానికి ప్రయత్నిస్తున్నారు. అందరూ తలోదారి అయ్యేరు. వాళ్ళకేదో చోటు చూపాలి.

'నాకేం తోచలేదు. వెంటనే హైస్కూలు బిల్డింగులు గుర్తువచ్చాయి. వాళ్లని తీసుకెళ్లేను. మీ కెవ్వరికీ చెప్పడానికి వ్యవధి లేదు. ఏదో చెయ్యాలి...'

సత్యానందం అతనిని మెచ్చుకున్నాడు.

'చాల మంచిపని చేసేవు. చాలా మంచి పని చేసేవు.'

రంగనాయకులు సంకోచిస్తూ మళ్ళీ మొదలెట్టేడు.

'మీ పల్లెను మీనుంచి విడదియ్యాలనే ఆలోచనతో కాదు. వాళ్ళు ఏమైపోతున్నారో అనిపించి బాడవలో మాలపల్లె వాళ్ళనికూడా తీసుకువచ్చేను...'

సత్యానందం హృదయంనిండి వచ్చింది. కంఠం గద్గదికం అయింది.

'ప్రజలకి సాయపడేందుకు పార్టీలు కాని వారిని మీవాళ్ళు, మావాళ్లు అని పంచుకొనేందుకు కాదు. నువ్వు నాకంటె చిన్నవాడివి, నిన్ను మెచ్చుకోడం తప్ప, నీమీద నా మనస్సులో కలిగిన భావాన్ని మరో విధంగా చెప్పలేను. కాని చాలా మంచి పనిచేసేవు, చాల మంచిపని చేసేవు.'

రంగనాయకులు సెలవు తీసుకొని లేచాడు. నాలుగు అడుగులు వేసి, మళ్ళీ వెనక్కి వచ్చేడు.

'డాక్టర్! నాకు ఒక ఆలోచన కలిగింది అని సత్యానందం వెనుదిరుగుతున్న రంగనాయకుల్ని చూసి అన్నాడు.

'నాకో అభిప్రాయం కలిగింది. చెప్దామనుముందు మీరేదో చెప్పబోయేరు. కానీండి'— అన్నాడు రంగనాయకులు.

'ఈ తుఫాను కలిగించిన నష్టం ఎంతో ఇంకా తెలియదు. కాని వీధుల్లో పెట్ట స్థితి చూస్తే చాల తీవ్రంగా వున్నట్టే అనుకొంటున్నా. వరదలూ, తుపానులూ వెనక వచ్చే అంటురోగాల నష్టం తక్కువేం వుండదు. తుపానుని మనం ఆపలేకపోవచ్చు కాని, అంటురోగాల విషయంలో ఏ కొంచెమన్నా చెయ్యగలుగుతాం...'

తన మనస్సులో ఆలోచనలను చదువుతున్నట్టే వినిపించి రంగనాయకులు తెల్లబోయేడు.

'నేను సరిగ్గా ఆ విషయమే చెప్దామనుకొంటున్నా. 'మీరే ఎత్తుకున్నారు' అన్నాడు.

'పంచాయతీ బోర్డునుంచి మందులకి కొంత సొమ్ము ఖర్చుచేద్దాం. కనీసం వూరువరకైనా వైద్యసహాయం నాలుగుమూలలా అందేటందుకు ఏర్పాటు చెయ్యాలవా?'— అన్నాడు, సత్యానందం.

'రంగనాయకులు అంత పని తన ఒక్కడివల్లా జరగదన్నాడు. కాని అతడు చెప్పిన అభిప్రాయం నిరాకరించతగినదిగా కనిపించలేదు.

'మీ రామకృష్ణ వూళ్లోవున్నాడు.'

కాని కొడుకు ఆ పనికి ఒప్పుకొంటాడనే విశ్వాసం సత్యానందానికి లేదు. ఆతడూ విదటనే వున్నాడు కనుక తన అవిశ్వాసాన్ని కనబరచలేదు. అందుచేత ఉమ్మడిగా సలహా యిచ్చేడు.

'ఆ బాధ్యత నువ్వు తీసుకో. నీకు కావలసినసహాయం అడుగు. ఒక్క రామకృష్ణేనా? సుశీల వుంది. క్వాలిఫైడ్ డాక్టరు...'

రామకృష్ణ తన అనంగీకారం అక్కడే తెలిపేడు. అసలీ వైద్యవిద్యే పెద్ద బూటకం అన్నాడు.

'నాకు నేర్పేది, మందులు అమ్ముకొనే వాళ్ళకి జేబులు నింపే చదువు. మన జనసామాన్యం వాటిని కొనలేదు. వారికి అందుబాటులో వుండే కూరాకు వైద్యం మానుకు చేతకాదు. ఇదంతా పెద్ద బూటకం. నేను రాను.'

దానిమీద చర్చ ప్రారంభమయి అసలు విషయం మూలబడుతుందని జానకి చటుక్కున అడ్డుపడింది.

'రామకృష్ణ వాదనలో కొంత కొంత నిజం లేక పోలేదు. అయితే ఎంత నిజం, ఏది నిజం అనేది చర్చించడానికిది సమయం కాదు. ఎవరికి తోచినపని వారు చేద్దాం.'

రంగనాయకులు 'ఊ'న్నాడు.

'మీ రెవ్వరైనా సుశీలతో మాట్లాడగలుగుతారా? ఈ లోపున నేనింటికిపోయి బట్టలు మార్చుకొని వస్తా.'

ఆ దంపతుల మధ్యనున్న ప్రేమసామ్యం ఎరిగినవారెవ్వరూ రంగనాయకులు ప్రతిపాదన అంగీకరించలేకపోయేరు.

వారి తటపటాయింపును గమనించినట్టు రంగనాయకులే మళ్ళీ అన్నాడు.

'ఇంటికెళ్ళేటప్పుడు అవిడని నేనే అడుగు



తాను మా కౌంసిలర్లని మహిళాసంఘం వర్కునీ సాయం తీసుకొందాం. సత్యానందం గారూ! ఇది నా ఒక్కడివల్లా కాగలది కాదు. ఇలుగురం చేద్దాం. మీరంతా సరే అంటే జరుగుతుంది.'

వారు సమాధానంకోసంకూడా నిలబడకుండా రంగనాయకులు నిష్క్రమించేడు. జానకి సత్యానందానికి సలహా ఇచ్చింది.

'నువ్వు సుశీలతో మాట్లాడు, అతని ఆలోచన మంచిదే.'

* * *

బిబ్బాలు మార్చుకొని రమ్మని, తాను ఈలోపుగా స్కూలుకు వెళ్ళి, వాళ్ళకి ఏం కావాలో చూస్తానని రంగనాయకులను పంపేతుగాని, సత్యానందం వెంటనే కదలడానికి వీలులేకపోయింది. హైస్కూలు హెడ్మాస్టరూ, మరో ఇద్దరు టీచర్లని వెంటబెట్టుకొని కామేశ్వరరావు వచ్చి వున్నాడు. వస్తూనే, సుందరరావూ, కొడుకూ తుపాకుపేరుతో తమరు కష్టపడకుండా మాలపల్లెలను కూడగట్టుకొనేందుకు పన్నిన కుట్రను వివరించడం ప్రారంభించేడు.

'అత్తగారి సొమ్ము అల్లుడు ధారపోసినట్లు హైస్కూలులోకితెచ్చి తమ పల్లెవాళని మకాం పెట్టించేడు. మనకి చేతగాకనే వూరుకొన్నామా? హెడ్మాస్టరుది స్కూలులో పూచిక పుల్ల కదలకుండా చూసుకోవలసిన బాధ్యత, స్కూలు కమిటీ సెక్రటరీ విశ్వనాధం వున్నారు. పంచాయతీ అధ్యక్షులు మీరున్నారు. వీళ్ళెవ్వరితో మాటైనా చెప్పకుండా తన బాబు ముల్లె అన్నట్లు అందులోకి తెచ్చిపెట్టేడు. ఇదేమిటంటే చూసేరా అని యాగీచేసి మనల్నందర్నీ అవకతవకల పాల్జేయొచ్చు. వూరుకొంటే చూసేరా మా పార్టీ పూనుకోకపోతే...'

కామేశ్వరరావు వాగ్ధోరణి చికాకు కలిగిస్తున్నా సత్యానందం ఏమీ అనలేకపోతున్నాడు. అతడు తనపార్టీ సభ్యుడు. మిగిలిన ముగ్గురూ సభ్యులుకాదు. అతనిని వారి ముందు ఏసువడానికి వీలులేదు.

'మనం ముందే పూనుకొని వుంటే సరదాపుగారికి అవకాశం వుండేదికాదు. లేకపోయేం వ్వ్!' అన్నాడు, అతి వ్యంగ్యంగా.

'మేం బాధ్యతలుగల వాళ్ళం, మంతెన

# ఈదారి ఎక్కడికి?

రావులా చిల్లా వెయ్యగలం?'

కామేశ్వరరావు అవమానాన్ని పనిమాలా కోరుతున్నాడనిపించింది. కాని, సత్యానందం చాల జాగ్రత్తగానే తూచినట్లు మాట్లాడుతున్నాడు.

'బోర్డు అధ్యక్షుడుగా మరి నేనెయ్యవలసిన బాధ్యతను వదిలెయ్యి. కనీసం మానవులయెడ మానవులు చూపవలసిన సత్ప్రవర్తనం కూడా చూపలేకపోయేను. అదీ నా విచారం...!

ఇంక మువ్వు కట్టిపెట్టమన్నట్లు అతని పేస్ప ఏదు ఓప్పి హెడ్మాస్టరును అడిగేడు.

'ఇంతగాలి—వానలో వచ్చేరు. ఇదేనా విషయం?'

'చిత్తం.'

'మొన్న మీ యింటి దిబ్బ వగం కాల్చేరు మీరూరుకొన్నారు, ఆ వేళ హైస్కూలు గేట్లు విరగకొట్టేరు...' అని కామేశ్వరరావు మళ్ళీ సుందరరావు అపరాధసహస్రం గుణించ ప్రారంభించేడు.

అతని మాటలు పట్టించుకోకుండా సత్యానందం హెడ్మాస్టరుతోనే మాట్లాడేడు.

'మేస్టారూ! ఏం భయం అక్కర్లేదు. అనుమతికోసం అధికారని అడగడం, చెయ్యడం సాధ్యమయే పనికాదు. ఆ సమయంలో చెయ్యగలదేం లేదు. సుందరరావు గారు మనుష్యమాత్రుడుగా చెయ్యవలసిన పనే చేశారు...'

పార్టీనాయకుల మధ్యనున్న కక్షలూ, అహంకారాలూ విరిగి, గాలివాటం చూసుకుని, చక్కగా చుక్కానిపట్టే తెలివితేటలు గల హెడ్మాస్టరు సత్యానందం మాటలకు తప్పుగా అర్ధంచేసుకొన్నాడు. కామేశ్వరరావు వట్టి కబుర్లరాయుడని ఎరుగును. ఆ వారంలో తమ పార్టీ జరుపుతున్న కార్యక్రమాలలో కలియకుండా ఏదో పనివుందని విజయవాడవెళ్ళి విన్ననే వచ్చేడని తెలుసు. అతనియెడ కోపంతో సత్యానందం సుందరరావు పార్టీమీదగల ద్వేషాన్ని మరిచాడని వూహ సాగించేడు. అందుచేత తన ధోరణిని సవరించుకొన్నాడు.

'అది నిత్యమే కానీండి. కాని గేటు విరగ్గొట్టడం, తాళాలు పగలకొట్టడం... చాలా గొడవతెచ్చిందండి. సైగా. లైబ్రరీ రికార్డులు, ఫర్నిచరు. సైన్సు పరికరాలు ఏవి పాడువేసినా కొంపలారిపోతాయి...'

'ఏం ఫర్వాలేదు మేస్టారూ, మనుష్యుల ప్రాణాలకన్నా ఎక్కువేమిటి, ఇవన్నీ! ఒకవేళ ఏదన్నా జరిగినా, పొరపాటున జరుగుతుంది గాని. బుద్ధిపూర్వకంగా చెయ్యరు. అటువంటివి వస్తే సర్దుకోవాలి. సర్దుకొందాం. లేవండి, నో మాదు స్కూలుకేసి వెళ్ళొద్దాం. రాగలరా?'

'చిత్తం.'

'మీరు?'

మిగిలిన టీచర్లు ఇతర పనులు కారణం చెప్పారు.

'పనులు చూసుకోండి. కామేశ్వరరావు! మన వాళ్ళ నలుగురినీ నామాతు తీసుకు రాగలవా? వాళ్ళకి భోజనాలు ఏర్పాటు ఏదో చూడలికదా.'

'మా దూడల పాకపడి పోయింది...'

'దూడలకి దెబ్బలు తగలలేదు కద.'

'లేదు. అవుని ఇంటి వసారాలోకి తెచ్చేం కనక బతికి పోయింది.'

'పోనీలే' అని సంతృప్తి కనబరచేడు సత్యానందం.

'పాకలో అటక విరిగా కమ్మానా డొక్కా తడిసిపోయింది. దానికేదో చూడకపోతే రేపు పొయ్యిలో పిల్లి లేవదు.'

'అయ్యయ్యో పాపం. డొక్కా పేదు తడిస్తే ఏల్లాగ? మాలపల్లెలకి ఇవ్వి అలవాటే కనక వెళిరా...'

సత్యానందం అసహనానికి కామేశ్వరరావుకి కోపం వచ్చింది. కాని, ఏమీ అనలేదు.

'రామకృష్ణా! నువ్వుపోయి వెంకట్రావు, మందేశ్వరరావుల్ని పిలుచుకురా. స్కూలు దగ్గరికి రమ్మను ... రాండి మేస్టారూ! మీకేం పనిలేక పోతేనే. ప్రజాసేవ నిర్బంధం కాదు. సైగా సుందరరావుగారికి తగిలినట్లు చీవాట్లు కూడా తగలొచ్చు!'

* * *

కొంతదూరం వెళ్ళేక సత్యానందానికి జ్ఞాపకం వచ్చింది.

'మీరు స్కూలుకి వెళ్ళండి నేను విశ్వనాధంగారితో మాటాడి ఆయన్ని వెంట తీసుకొస్తా. సాధ్యమైనన్ని గదులు


స్త్రీలకు కొన్ని
రోజులలో అసౌఖ్యము
కలిగి బాధగా
వుంటుంది. అల్లాంటి
రోజులలో సారిడన్
వారికి ఉపశమనము
నిచ్చి, హాయి
నవోత్సాహములను
కూడా కలిగించును.
సారిడన్

# ఈదారి ఎక్కడికి?

ఉండి: కొరడెం పెద్దవాళ్ళని చూసి గంద్రగోళం చెయ్యకుండా చూడమనండి. ఇంతలో వాళ్ళకేదో ఏర్పాట్లు చూస్తాం.'

హెడ్మాస్టరు 'చిత్తం' అని ముందు కడుగు వేసేడు.

స్కూలు దగ్గరకు వెళ్లేసరికి చూసిన దృశ్యానికి హెడ్మాస్టరు తల తిరిగి పోయింది.

వర్షంలోకి దిగడం ఇష్టం లేక ఇద్దరు అమ్మలు తమ పిల్లల్ని స్కూలు అరుగు కొసన దొడ్డికి కూర్చోబెడుతున్నారు. చూడగానే హెడ్మాస్టరు కోప్పడ్డాడు.

'వుండవలసిన చోటు ఇల్లా గలీజు చేసుకొంటే అవరి శుభ్రం మాట అల్లా వుంచండి, ఏ అంటురోగాలన్నా వచ్చేయుంటే...'

హెడ్మాస్టరు గొంతు వినగానే ఎక్కడెక్కడువున్నవాళ్ళూ ఆయన ఎదుటికి వచ్చేరు. దండాలు పెట్టేరు. రాత్రి తాము పెడ్డ ఇబ్బందులు చెప్పుకొన్నారు. డాక్టరు రంగనాయకులు చేసిన సాయం పొగిడేరు.

హెడ్మాస్టరుకు తాను రాగానే కనిపించిన అసహ్యకర దృశ్యాన్ని మరవలేకున్నాడు. అంతనుందిని తడిగుడ్డలు. వాడికాళ్ళు, తడిసి చీకిరి బాకిరిగా వున్న తలలుతో ఒక్కచోట చూసేసరికి మరింత అసహ్యం కలిగింది.

'అత్తగారి ఆస్తిని అల్లుడు ధారపోశాడన్నట్టు రంగనాయకులుగారిదేం పోయింది. విద్యాలయం అంటే ఎంత పరిశుభ్రంగా వుండాలి? అది సరస్వతీదేవి ఆలయం అన్న మాట దానిని ఎంత పవిత్రంగా వుంచాలి?'

సరస్వతీదేవి మందిరాన్ని అపవిత్రం చేస్తూ... వచ్చేసరికి జరుగుతున్న కార్యాన్ని చెప్పేడు.

'...ంటి అభాగ్యులు కనకనే పొట్ట... డోలు కట్టినా 'థం' అని పలకడం

...డ చేరిన వాళ్ళంతా వచ్చింది ఆ క్షణం వరకు ఏదో మూల ఆ దేహబాధలు తీర్చుకొన్న వాళ్ళే. ...రూ ఒప్పుకోలేదు. తాము తప్పు వందర్నీ కలిపి తిట్టేర్ను ముదన్నారు.

...ళ్ళండి, బుద్ధిలేని వెధవలండి.'

హెడ్మాస్టరు వాళ్ళ బలహీనత నెరుగును. దానినక్కడ వదిలేసి వుండాలి. అతి సహజములైన దేహబాధలకు మార్గం చూపాలి. వాళ్ళస్థితి గమనించాలి. సమయం చూడాలి. సానుభూతితో వాళ్ళకి చెప్పాలి. కాని అవేమి ఆయనకు పట్టలేదు. తన రాజ్యంలోకి అడవి మృగాల్లాగా ఈ అతిగా జనం వచ్చి సర్వం ధ్వంసం చేసేస్తున్నారనే దొక్కటే బాధ. కాని, వాళ్ళని తరిమెయ్యలేదు. గ్రామంలోని రెండు బలమైన పార్టీలు వాళ్ళయెడ సానుభూతి చూపుతున్నాయి. వారికి సాయం చేయడానికి పూనుకొన్నాయి. తానేం చెయ్యగలడు. ప్రతి చిన్నదానికి నస పెట్టగలడు. వాళ్ళని సాధ్యమైనంత త్వరగా పోయేటట్టు అరికాళ్ళ క్రింద మంటలు పెట్టగలడు.

ఆదే ప్రారంభించేడు.

'ఇదిగో చూడండి. పిల్లలు కూర్చునే బెంచీలు ఇల్లాగేనా బాడిచేయడం.'

అయిదునిముషాలు ఆ వుపన్యాసం పొగింది. మళ్ళీ మరో విషయం.

'బీరువాలూ, పుస్తకాలూ, కాగితాలూ ఎవ్వరూ ముట్టుకోకుండా చూడండి. అయ్యో! రికార్డు గది కూడా తలుపుతాళం విరిచేసేరే. గుమాస్తా ఏడుస్తాడు. అందులో కెవ్వరూ వెళ్ళవద్దు...'

అందరికీ విసుపు పుట్టింది. కోపం వస్తోంది. తమ స్థితి ...డముచ్చటగా వుందని వాళ్ళూ అనుకోడంలేదు. కాని ఏం చేస్తారు? మారుగుడ్డలేదు. మార్చుకోనేందుకు. హోరున వర్షం కురుస్తున్నా వొళ్ళు శుభ్రం చేసుకొందుకు ఇన్ని నీళ్ళు పట్టడం సాధ్యంకాదు. ఏమీలేదు. కడుపులోకి తిండిలేకపోయినా దేహ బాధలు తప్పవు. వానిని తీర్చుకొనేందుకు ఏర్పాట్లు లేవు. తమ గుడిసెల్లో అలవాటుపడ్డదే ఇక్కడా చేశారు. మామూలు పరిస్థితుల్లో అయితే తామూ అలా చెయ్యరు. తమకూ తెలుసు. కాని,...

కాస్త సానుభూతి చూపడం లేదు. ఎల్లా బతికొచ్చేరని లేదు. గంజి తాగేరా? పిల్లగాళ్ళు అల్లా ఏడుస్తున్నారు. వాళ్ళకి ఇవ్వడానికేమిటి? — ఒక్కమాటా పలుకూ లేదు. వచ్చిందది మొదలు ఒకటే రంధి.

ఈమారు హెడ్మాస్టరు పంథా మార్చేడు. గోడనున్న గాంధిగారి పటం చూపి ఆయన హరిజనులకు చేసినసేవ ఎల్లా బూడిదలో పోసిన పన్నీరయిందో చెప్తూ దుఃఖపడ్డాడు. ఆ దుఃఖభారంతో సుమతీశతక పద్యం జ్ఞాపకం చేసుకొన్నాడు.

'కనకపు సింహాసనమున
శునకము కూర్చుండబెట్టి...'

'నోర్ముయ్యి' అన్న ఆదేశం వినబడి హెడ్మాస్టరు 'ఆ...' అని తల ఎత్తేడు.

ఎదుట గుమ్మంలో రామకృష్ణ, కళ్ళు నిప్పులు కురిపిస్తూ ఒక్కమారు విదిలించేడు.

'మీలో ఒక్కడు నోరు మూయించలేకపోయేడా? ఇందాకటినుంచి చూస్తున్నా. ఒకటే నొండపెట్టడం. మీరూరుకుంటే ఇల్లాగే మీకు వెర్రెత్తించెయ్యగలడు. తన్నండి వాలుగు, చూస్తారేం.'

రామకృష్ణ ముందుకు రావడం చూసి హెడ్మాస్టరు హడలిపోయేడు. పారిపోడానికి ప్రయత్నిస్తూంటే అతడే లోపలికి గెంటేసేడు. అతని భయం, బలహీనత స్పష్టమైన కొద్దీ రామకృష్ణకి కసి పెరుగుతూంది.

'ఇది విద్యాపీఠమా? సరస్వతీ మందిరమా? ఈ రికార్డులు వాళ్ళని రక్షిస్తవా? ఈ గాంధి వాళ్ళని ఉద్ధరించేడా?...'

ఒక్కొక్క వస్తువును హెడ్మాస్టరు కాళ్ళముందు విసిరికొట్టేడు. నాయకుల పటాలు నేలకేసి కొట్టేడు. రికార్డులన్నీ బీరువాలోంచి లాగి బయట పారేసేడు.

ఇంత గంద్రగోళం జరుగుతున్నా, హరిజన పేటవాళ్ళు ఒక్కళ్ళూ అతనికి సాయం రాలేదు. పరమేశు గుమ్మంలో నిలబడి వున్నాడు. అతని పక్కనే ఒక కర్రీ వేయించుకొని జాన్ కూర్చున్నాడు. పేటలో పెద్దమనుషులు అంతా హెడ్మాస్టరును చూసి నవ్వుతున్నారు. రామకృష్ణ ఒక్కొక్క సందెడు రికార్డులు విసిరిపారేసినప్పుడూ, ఓ పటం నేలకేసి కొట్టినప్పుడూ విజయధ్వానాలు చేస్తున్నారు.

కొంతసేపటికి గాని రామకృష్ణకు ఆ బీభత్సకాండను వడవడంలో తనకెవ్వరూ

తోడురాలేదని గ్రహణకు రాలేదు. గుమ్మంలో రిజిస్ట్రాకడూ, నయా రిజిస్ట్రాకడూ నిలబడీ, చదికిలబడీ వున్నారు. వాళ్ళు ప్రజాప్రవాహానికి అడ్డుకట్ట వేస్తున్నారని పించింది.

తెల్లబోయేడు.

'లేవండి. దారికడ్డం తొలగండి.'

పరమేశు కదలలేదు.

'తొందరపడకండి. ఆయనను తిట్టి లాభం ఏమిటి? వీళ్ళని ఆడిస్తున్నవాళ్ళూ, ఆసరాగావున్నవాళ్ళూ వేరు. రండి.'

జాన్ ఆతనిని సమర్థించేడు.

'ఇది ఒక్కళ్ళవలన అయ్యేపనికాదు బాబూ!'

రామకృష్ణ తెల్లబోయేడు.

జనం ఒక్కళ్ళు కదలడంలేదు. తిడు తూంటే కదలలేదు. వాళ్ళకి తోడు నిలిస్తే కదలలేదు. వాళ్ళతోవున్న రాజకీయవాదులు తన పక్క చేరడానికిబదులు తన్ను తొందర పడవద్దంటున్నారు. దేశమూ ఏమయిపోతు న్నాననిపించింది.

చేతిలోని పుస్తకాలు హెడ్మాస్టరు మొగాన కొట్టేడు.

'తిట్టు, నీచేత తిట్టు తినడానికే వీళ్ళు పుట్టేరు. ఈ పందులకి బురదలో దొర్లా లని తప్ప మరో కోరిక లేదు. దొర్లనీ. దొర్లినందుకు తిట్టు'— అంటూ ఆవేశం పట్టలేక భళ్ళున ఏడ్చేడు.

* * *

సత్యానందం వాళ్ళకోసం అన్నాలు పట్టించుకొంటూ, ఆ కేకలూ, ఏడుపూ విన్నాడు. ఆ కేకలు చివరి పిడకి, ఆ ఏడ్పే మిటి? స్వరం అనుమానం కలిగించినా అది కొడుకుదే అనుకోలేకపోయేడు.

తాతన్న ఎదురొచ్చేడు. ఆతని ముఖంలో ఆత్రం కనబడుతూంది. ఎవరికో ముఖం చాటు చేస్తున్నట్టు కనబడుతున్నాడు.

'ఏమిటది వెంకట్రావూ?'

తాతన్న కథ అంతా చెప్పేడు.

'అబ్బాయిగారు తొందర పడుతున్నారు. ఇటువంటి పనులవలన ఏప్లవం రాదని మీరేనా చెప్పండి.'

అంత ఆదుర్దాలోనూ సత్యానందానికి నవ్వొచ్చింది.

'విప్లవం ఆలోచన వచ్చేవరకూ మీరంతా ఏందుకూరుకున్నారు? నవ్వున్నావు. పర మేశం; జాన్ ఇందరున్నారు. హెడ్మాస్టరును మొదటనే మందలించలేక పోయారా?' —అన్నాడు సత్యానందం.

'అసలు తప్పు మనవాళ్ళదండి.'

'అల్లాంటి తప్పు చేస్తుంటే మీరెం దుకు వూరుకున్నారు?'

'మన మాట ఎవరు వింటారండి. పోవోయ్! మహా చెప్పొచ్చేవు—అనేస్తే...'

సత్యానందం వెరగుపడ్డాడు, ఆ మాటకి. తమ మాట జనం వినరేమోనన్న అను మానం కమ్యూనిస్టులకి కలిగివుండనిరోజులు, ఆనాటి వారి ఆత్మవిశ్వాసం గుర్తు వచ్చి, నిట్టూర్పు విడిచేడు.

'ఇదిగో వెంకట్రావు! హెడ్మాస్టరు చదువుకొన్నవాడు. ఇంగితం తెలిసి వుండాలి. తెలియలేదు. గుడిసెల్లో, మురికిమూపాల్లో బతికిన జనం వీళ్ళు. వాళ్ళకి ఆరోగ్య సూత్రాలు తెలియవు. పైగా వాళ్ళున్న పరిస్థితి ఏమిటి? పోనీ, తెలిసినవాళ్ళు మీరంతా వున్నారు. మీరు ఏందుకు చెప్ప లేదు? అల్లాగని హెడ్మాస్టారి కథ ముదురు తున్నప్పుడు ఆయనతో అయ్యా! మీరు చేస్తున్న పని మంచిది కాదని...'

వెంకట్రావు 'బాబోయ్!' అన్నాడు.

'ఆయన అల్లా వున్నారనా? పైకి మెత్తగా వుంటూ ఏంతపనేనా చెయ్యగలడు. స్కాలర్‌షిప్ రావడం ఆలస్యంచేస్తే చాలదా? ఆ కక్ష పెట్టుకొని కుర్రగాళ్ళ పరీక్ష తప్పించేస్తే?...'

సత్యానందం తెల్లబోయేడు. అంతలో ఆతనివంక జాలిగా చూసేడు. మళ్ళీ తామంతా కొంచెం ఇంచుమించు అదే ధోరణిలో వ్యవహరిస్తున్నారని గుర్తు వచ్చింది.

'నీదేముందిలే. మన బ్రతుకే ఒరగేసుకు పోవడంగా తయారయింది. కనీసం కుర్ర వాళ్ళు ఆరోగ్యంగా వున్నారు. వాళ్ళకి హృదయం స్పందనిపించుకున్నారు. ఆ ఆవే శాలు మన అసమర్థతకి రియాక్షన్ ఏమో.'

* * *

రిజిస్టర్డు కవరులో వచ్చిన దస్తావేజును చూసి సత్యానందం ఆశ్చర్యపడ్డాడు. పోస్టు మాస్టరు చెప్పినప్పుడే కవరు చేతికి వచ్చే వరకూ, అదేమిటో అర్థంగాక ఒకటే కంగారుపడ్డాడు. ముందు వుత్తరంకోసం వెతికేడు. అది లేదని నిశ్చయించుకున్నాక కాగితాలు విప్పేడు. దస్తావేజు. మొదటి మారు చదివినప్పుడు ఆ కంగారులో ఏమీ అర్థం కాలేదు. తంటి పేరుతోనవా రవీంద్రనాథరావుకు దానవిక్రయాద్యధికారా లతో భూమినిస్తున్నట్టున్న ఆ దస్తావేజుకి తలా తోకా కనబడలేదు. ఎవరో ఆ రవీంద్ర



ఆయనే సైంటిస్ట్ సరసంగారు విరసంవారి సిరాల్లో వుందా? అని పరిశోధన చేస్తున్నారు.

# ఈ దారి ఎక్కడికి?

కాళరాత్రి ?

మరల మొదటికి వచ్చేడు. 'ఆ'—అను కొన్నాడు. తన తెలివితక్కువతనానికి ఒక్క మారు నవ్వుకున్నాడు.

'భద్రా! జానకీ.'

వాళ్ళు వచ్చేలోపున మరో మారు చదివేడు. ఈ మారు నవ్వు రాలేదు. ఆలోచనలో పడ్డాడు.

'ఎందుకు పిలిచావు?'—అంది జానకి.

'ఆ కాగితాలేమిటి?' — అంది భద్ర.

చూడమంటూ దస్తావేజు జానకిచేత పెట్టి, విషయం భార్యచెవిని వేసేడు.

'బాడవపొలం మీ మామయ్య మనుమని పేర వ్రాశారు. అదీ దస్తావేజు'

భద్ర సంతృప్తి కనబరచింది.

'గుడ్డిలోమెల్ల'

సత్యానందం ఏదో చెప్పబోయి, మళ్ళీ అంతలో వూరుకొన్నాడు.

'మేం వచ్చిన సాయంకాలంనుంచీ గలీ-బాగానే వుంది. తుపాను తర్వాత వచ్చిన మొదటి టపా ఇది. ఆయన ఎప్పుడు రిజిష్టరు చేయించేరు? ఎప్పుడు పోస్టు చేశారు?'— అంది భద్ర.

జానకి దస్తావేజును ఆమూలం రెండు మార్లు చదివింది చివరకు వేసినప్రశ్న—

'ఈభూమి ఏమిటి?'

'తాతగారు మనమడికిచ్చేరు. ఏమిటన్న ప్రశ్న ఏమిటి?' అంది భద్ర.

'అది సరే ఈభూమి ఎక్కడుంది? ఆయనకు ఈవూళ్లో భూమివున్నదని విన్న గుర్తులేదే' అంది.

'దివానుగా వున్నప్పుడు సంపాదించేరులే' అన్నాడు, సత్యానందం.

ఆ సంపాదన విధానమిదివ్రకటంగా ఐయటపడింది.

కుమారస్వామి దివానుగావున్న రోజుల్లో కరణానికీ, రివెన్యూ ఇన్‌స్పెక్టరుకూ ఇంత మేతవేసి బాడవలో మురుగుకాలవ సానుకొని ఉ. బంజరు భూమిని తనపేర పట్టా చేసుకొన్నాడు. పేరు మారింది. పన్ను కొంది. కాని అది ఎవ్వరికీ తెలి

మాలపల్లిలో బత్తుందారు లంక తరిమివేయ గలిగేడు. 1948 లో ... విప్లవ విధానంతో ...

పల్లె గట్టిదెబ్బ తినేసింది. అటుతర్వాత బాడవలో బంజరుకోసం దరఖాస్తు పెట్టేరు. అప్పుడున్న హరిజన తాశీల్దారు సంతకం పెట్టేడు.

కాని, తీరాచూస్తే అది దివాను పేరట పట్టా అయివుంది. అది అన్యాయం అని గ్రహించి తాశీల్దారు పాత కాగితాలు తిరగ వెయ్యడం ప్రారంభించేడు. అతని నోరు మూయడం సాధ్యంగాక ఎక్కడికో బదిలీ చేయించేరు. కాని భూమివిషయం తగువులో పడింది.

కథనంతనూ చెప్పి సత్యానందం ఆ విధంగా మనుమనికి ఆభూమి వ్రాయడంలో వున్న నీతుగడను వూహించేడు.

'పల్లెవాళ్ళ తరపున కమ్యూనిస్టుపార్టీ ప్రయత్నం చేస్తూనేవుంది. ఓరగా తోడుతూనే వుంది వ్యవహారాన్ని. పార్టీ చీలిపోయేక పల్లెలోనూ చీలిక వచ్చింది. ఆ

## ఓం నమః శివాయ

ఢండం యని డబ్బా వాయించ
డాంబికుల గర్వము గూల్చి గుణము గుర్తింతున్.

డింబికను, నిశ్చల నిధిని
డీ, నీ నిబిడ నిశ్చల నీతుల నరసితన్.

డుక్ డుక్ మనే మనస్సును
డూ చూడు చెలించె చిత్త చాంచల్య చపలవై

డృ, ధృత తర దీరవైతి
డౄ, తృణీకరించ, ధ్వంసంచేయు, రూపం బిత్తున్.

డెవడు నాకిచ్చె పిచ్చితనం
డే, నేడు ప్రతిఘటించి ప్రారంభించితిన్.
డై, నైయనిపించు లింగన్నా
డొ. ఒక్కటే పట్టు భరింతు కల్పింతు కవిత కల్పనల్.

డో, శోధించి సాధింతున్
డౌ, గౌరవం దక్కించే భారం భరించు భూతేశ.
డం డని చందం చేతునా
డః హరా నిన్ను నమ్మిన నాక నవ్వుతంబౌనే

రచయిత్రి: శ్రీమతి సరస్వతిగిరి

భూమిని మీ మామగారు జోగన్నకి కౌలుకిచ్చేరు.'

'ఏ జోగన్నకి?' అంది జానకి ఆశ్చర్యంతో.

'మరేజోగన్న! రంగమ్మవ్వగారి జోగన్నే' అంది భద్ర.

'మరి అతను మార్క్సిస్టేమో' అని జానకి ఆశ్చర్యం కనబరిచింది.

'మీ మామగారు రాజకీయాలు ఏమీ ఎరగనట్లుంటాడు గాని, చాణక్యుడు. కమ్యూనిస్టు పార్టీలోవున్న తగవులకు మూలం తెలిసినా తెలియకపోయినా పట్టుదలలు గ్రహించేడు. జోగన్నని పిలిచి కౌలూ, కదపా లేకుండా ఆ భూమిని చేసుకో మన్నాడు...'

'మరి సుందరావుగారు ఏల్లా పొప్పుకొన్నారు?'—అంది జానకి.

మాలపల్లె, మాదిగపల్లెల వాళ్ళు అంతా తమ పార్టీపక్షాన వుంటే ఒప్పుకొనేవాడు కాదు. కాని, అటూ ఇటూ అయ్యేరు. తమ పార్టీలోకి రానివాళ్ళని శిక్షించేందుకు, ఆశ పెట్టేందుకు అదో ఆయుధం అనుకున్నాడు. జోగన్నకి వెనక బలం ఇచ్చేడు...'

అంతా ఒక్కనిముషం వూరుకొన్నారు. ఆపేచీ లోతులు మనస్సుకి పట్టేనాక జానకి 'మరి ఇప్పుడిదేమిటి?—అంది.

'ముసలాయన మంచియోగంధ రాయణం తలపెట్టేడు. పల్లెవాళ్లు పేచీ మాన లేదుగా. మీ మీద అభిమానంగా వున్నాను గనక, ఆ అభిమానంతో నేను పల్లెవాళ్ళని దిగతీస్తాననో, లేకుంటే విశ్వం అంటే వున్నగౌరవం, అభిమానం కొద్దీ...'

జానకి నవ్వింది.

'వాళ్లో వదిలేసుకుంటారనా?' అంది.

'అల్లాంటిదేదో ఆయన మనస్సులో వుండి వుంటుంది'—అన్నాడు సత్యానందం.

'మీరు మరీ 'సినికల్'గా తయారవుతున్నారు. ఏదిచేసినా తప్పులెన్నే ఆలోచనలేంచేనా చూడడం?' అని భద్ర కోప్పడింది.

'అలాగే అనుకొంటూండు.' అన్నాడు సత్యానందం.

(ఇంకా ఉంది)

# కొత్త మైమరపించే లవెండర్

మురిపించే
సుగంధ
మాధుర్యాలు

## లక్మే
లవెండర్
బ్యూటీ టాల్క్‌తో




పరవశింపచేసే వాసనా లహరులు, లవెండర్‌తోనే. అది కల్పిస్తుంది ఆధునిక పరిమళాలు. లక్మే లవెండర్ బ్యూటీ టాల్క్—సుతి మెత్తనిది, అతి చక్కనిది, అత్యంత తాజాదనం కల్గించేది. ప్రతి రోజూ లక్మే లవెండర్ టాల్క్ భోగాలలో తేలిపోండి. అది ఒక నూతనానుభవం... నేటికి...ఎప్పటికీ...



లక్మే టాల్క్ 5 ఉత్తేజకర సువాసనలలో దొరుకుతుంది
లవెండర్, వెటివర్, నిర్వాణ్, సాండల్ మరియు ఫ్లోరల్

ASP/L-63

# గురుదక్షిణ




కె.వి. వెంకటేశ్వరరావు

గంటనుంచి చూస్తున్నాగాని ఒక్క బస్ కూడా రాలేదు. స్టాప్‌లో రామం తప్ప మిగిలినవారందరూ వివిధ వ్యాపారాలలో వున్నారు. నం. 14 బస్సు తప్ప అనవసరమైన బస్సులన్నీ ఊరకుక్కల్లా తిరుగుతున్నాయి. కార్లలో వెళ్ళేవాళ్ళు బస్ వైటర్సుకేసి షోగ్గా, జాలిగా చూస్తూ వెడుతున్నారు. స్కూటర్లమీద వెళ్ళే జంటలని చూస్తే రామానికి కొంచెం బాధతోపాటు ఈర్ష్యకూడా కల్గుతోవుంటుంది. 'ఈ సుశీల తన రాకకోసం యెదురు చూస్తూ వుంటుంది. సరిగ్గా సినిమా టైమ్ పెట్టుకున్న రోజునే యీ బస్సులు...' ఈ నిరుత్సాహమైన ఆలోచనలతో విసుగుతోవున్న రామానికి ఎదురుగా రోడ్ పేవ్‌మెంట్ మీద నడుస్తున్న ఆకారం కన్పించింది.

'ఔను...మాస్టారు ... రామనాథం మాస్టారే సందేహం లేదు' అస్పష్టంగా గొణుక్కున్నాడు రామం. పరుగులాంటి నడకతో ఆయనను చేరుకున్నాడు. తన యెదురుగా చిరునవ్వు నవ్వుతూ నిల్చొన్న వ్యక్తిని చూసి ఆగారు రామనాథం మాస్టారు.

'నమస్కారం మాస్టారూ' అదే చిరునవ్వు. మాస్టారు తడుముకుంటున్నారు. మాస్టారు పెద్దవారైపోయారు. ముడతలుపడ్డ శరీరం. కొంచెం వంగిన నడుము. మాసినగడ్డం, ఆకుచెప్పులు, పంచి, పొడుగు చేతుల చొక్కా, చేతిలో సంచి. అయితే మాస్టారిస్వరూపం అప్పటికీ యిప్పటికీ మారనివి ఆయన నుదుటిమీది విభూతి రేఖలు, ఆరేఖలలో బ్రహ్మతేజస్సు కన్పిస్తుంది.

'నేనేనండి మాస్టారూ! రామాన్ని.'

మాస్టారి ముఖంలో వెలుగు గోచరించింది. 'రామం... నువ్వటోయ్ పెద్దవాడివయ్యావ్' ఆప్యాయంగా వీపు నిమురుతూ అన్నారు.

కొంచెంసేపటికి తేరుకొని రామమే 'బెజవాడనుంచి యెప్పుడువచ్చారు...మాస్టారూ!'

'నేనిక్కడికొచ్చి ఆర్నెల్లయిందోయ్' అన్నారు మాస్టారు ఎటో చూస్తూ.

[ఆరోగ్యంగా ఉందా? ఎందుకొచ్చేశావు? రాధ పెళ్ళయిందా? ఇప్పుడెక్కడుంది? శేఖరం, సూర్యం ఏం చేస్తున్నారు? ఇవన్నీ అడిగేయాలనిపించింది.]

కాని —సార్ 'రాధమ్మ కాంటినెంటల్ అండ్ కో వాళ్ళ షోరూమ్ లో పనిచేస్తూంది. నీవేం చేస్తున్నావ్?' ఆ విషయం అక్కడితో ఆపేయమన్నట్లు విషయం మార్చారు మాస్టారు.

(రాధ షోరూమ్‌లో పనిచేస్తూందా! అంత అవసరమేమొచ్చింది? సేల్స్‌గరల్‌గా. నూటపాతిక రూపాయల్తో వచ్చేపోయే పోకిరీ వెధవల్తో మాట్లాడుతూ, వాళ్ళ వ్యంగ్య సంభాషణలకి యేమీ అనలేని స్థితిలో రాధ ఎలా వుంటోంది.)

'నేనిక్కడ ట్రెజరీ ఆఫీసులో అక్కౌంటెంట్‌గా వుంటున్నాను మాస్టారూ!' అని 'రాధ ఉద్యోగంలో యెందుకు చేరిందండి? ఇంకా పైకి చదవలేక పోయిందా?' అణచుకోలేక అడిగేశాడు.

మాస్టారు ఒక నిట్టూర్పు విడిచి 'అదంతా ఒక పెద్దకథ బాబూ!' ఎప్పుడైనా వీలుంటే ఒకసారి మా యింటికి రా' అని అడ్రసు చెప్పి బస్సు వచ్చేసిందంటూ వెళ్ళిపోయారు మాస్టారు.

గానుగెద్దులా మళ్ళీ షాపులోకి వచ్చాడు రామం. బస్ రావేలేదు. ఆ మోహాలే. ఆ మాటలే వినుక్కున్నాడు మనస్సుతో.

'మాస్టారిలా వున్నారేమిటి' ఎంతా లోచించినా ఆయన వైఖరి బోధపడలేదు. అప్రయత్నంగా మనస్సు గతంలోకి పరుగెత్తింది.

తను బెజవాడలో చదివేరోజుల్లో రామనాథం మాస్టారు ఎలిమెంటరీ స్కూల్లో పని చేసేవారు. తన తండ్రి సుబ్బారావు గారు తాలూకాఫీసులో గుమస్తాగా పని చేసేవారు. తమ యింటికి మాస్టారింటికి నాలుగిళ్ళదూరం. మాస్టారికి ముగ్గురు పిల్లలు. పెద్దవాడు శేఖరం బి. ఏ. పాసయి ఖాళీగా వుండేవాడప్పట్లో. రెండోవాడు సూర్యం మెట్రిక్ చదివేవాడు. ఇక రాధ తన క్లాసే. స్కూలు దూరమవడంవల్ల తను రాధ కలిసే వెడుతూండేవారు. స్కూల్లో చదివేరోజుల్లో జరిగిన ఒక సంఘటన తనెప్పటికీ మరచిపోలేదు. ఆ సంఘటనే తన జీవితం సుఖమయిం కావడానికి దోహదం చేసింది. ఆ రోజు స్వాతంత్ర్యదినోత్సవం. జండా వందనం అన్నీ పూర్తయ్యాయి. పిల్లలకి మిఠాయి పంచడం దగ్గర వచ్చింది గొడవ. యస్. పి. యల్. రామం మిఠాయిలు పంచి పెడుతున్నాడు. మాస్టారి మాట ప్రకారం ఒక్కొక్కరికి రెండేసి యిస్తూ వచ్చాడు. రమేష్ తనకి గుప్పెడు యిమ్మని గొడవ ప్రారంభించాడు. మంకుపట్టు పట్టాడు. అతని మొండి పట్టుకి కారణం లేకపోలేదు. రమేష్ ఆ వూరి యమ్. ఎల్. ఏ. గారబ్బాయి. తను విషయం మాస్టారికి చెప్పాడు. అప్పుడు మాస్టారు రమేష్‌ని పిలిపించి మందలించి తనతో ఒక మాటన్నారు. 'ఒరేయ్...రామం! సృష్టిలో మానవులందరూ ఒకేలాగ పుట్టార్రా. ధనిక పేదవర్గాలు యివన్నీ మనం యేర్పరచుకొన్నవి. ధనం యేర్పరచిన పీనూ. అందరిని సమానంగా చూడు. పక్షపాత వైఖరికి యెన్నడూ చోటివ్వకు.' యీ వాక్యాలు దేముడు చెబుతున్నట్లుగా అన్పించింది.

తరువాత తను మెట్రిక్ చదువుతూండగా సుబ్బారావుగారికి హఠాత్తుగా గుండె జబ్బు వచ్చి మరణించారు. తన తల్లిని, తనని మేనమామ హైదరాబాదు తీసికొని వెళ్ళి తనను చదివించాడు. ఆ తర్వాత బెజవాడ విశేషాలు యేమీ తెలియలేదు. బి. కాం. పాసయి ట్రెజరీలో ఉద్యోగం వచ్చాక తనకి సుశీలతో వివాహం జరిగింది. బెజవాడ వదలిన తర్వాత మాస్టారు యిప్పుడు కన్పించడమే.

బస్ వచ్చింది. సినిమా బండిమీదకి పేపర కోసం వెళ్ళే పిల్లల్లా ఎగబడుతున్నారు ప్రయాణీకులు. ఆలోచనలతో యిల్లు చేరాడు.

వెలర రోజు ఒక ఆదివారం చూసుకొని మాస్టారింటికి బయలేరాడు. సందులు గొందులు తిరిగి ఒకపాత పెంకుటింటిముందు నిల్చొని పిల్చాడు. ఆ పరిసరాలు చాల అపరిశుభ్రంగా వున్నాయి. తలుపుతీసిన మాస్టారు కొద్దిగా తడబడి లోపలి కాహ్వానించారు. తనరాకను తలుపు చాటునుంచి రెండు కళ్ళు గమనిస్తున్నాయని అతని అభిప్రాయం. కాని రాధ కన్పించలేదు. షాప్‌లో ఏదో పనుండి వెళ్ళిందట. మాస్టారివలన తెలిసిన విషయమేమంటే శేఖరం యింటివిషయాలేమీ పట్టించుకోట్ట. షోలాపూర్‌లో యేదో కంపెనీలో పనిచేస్తున్నట్లు చెప్పారు మాస్టారు. సూర్యం బి. యస్సి ఫైనలియర్ చదువుతున్నాడట. ప్రస్తుతం తన కొచ్చే కొద్దిపాటి పెన్షన్‌తోను రాధ సంపాదనతోను సంసారం, సూర్యం చదువు అవుతున్నాయి.

మాస్టారి దయనీయస్థితికి పూర్తి సానుభూతిని చూపించాడు రామం. పలుగురితో కలిసి తిరుగుతూంటే బాధలు కొంత ఉపశమించ వచ్చుననే వుద్దేశ్యంతో వాళ్ళ కుటుంబాన్ని ఒక నాలుగురోజులుండడానికి రమ్మని పిలిచాడు రామం. కాని మాస్టారు నిరాశగా, నిర్లిప్తతతో 'వింటుకులే రామం' అని ఊరుకున్నారు. అప్పుడు తెలిసింది రామానికి, మాస్టారు చెప్పలేని తక్కువతనాన్ని ఫీలవుతున్నారు. దీనికి కారణం రాధ ఉద్యోగంకూడా కావచ్చు. మాస్టారిదగ్గర సెలవుతీసికొని వచ్చేశాడు రామం.

* * *

రోజులు, వారాలు గడుస్తున్నాయి. సంవత్సరాలు గడచిపోతున్నాయి. కాని మాస్టారు విడిగా కనబడటమేగాని ఒక్కసారిగారి కూడా యింటికి రాలేదు. రామానికి ఆఫీసరుగా ప్రమోషనొచ్చింది. అంటే తాను కూడ ఒక మానేజరన్నమాట. అతని సంతోషాని కవధుల్లేవు. ఆరోజు సాయంత్రం ఆఫీసులో బ్రహ్మాండమైనపార్టీ జరిగింది. సాయంత్రం పిక్చర్ కెడదామనిచెప్పి వచ్చిన రామం యింటికెళ్ళేసరికి తొమ్మిదయింది. ఇంటిదగ్గర సుశీల భర్తకి అన్నంవడ్డించి గిన్నెలు మూతపెడుతూ మూతికూడా బిగించుకొంది. 'ఎప్పుడు వెడదామనుకున్నా ఏదో ఒక అడ్డంకు రావడం పరిపాటైపోయింది.' సతికి కోపం వచ్చిందన్న సంగతి పతికి తెలుసు. కాని అసలు విషయం తెలిస్తే సంతోషిస్తుందనీ తెలుసు. కొంచెం సేపు ఉడికించాలనే వుద్దేశ్యంతో తను మౌనంగానే వుండిపోయాడు.

'మీ నాన్నగారి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది' నెమ్మదిగా మొదలుపెట్టాడు.

'ఏమని... ఏమైంది' సుశీల.

'ఆ...ఏమనికాదు. ఆఫీసరయ్యాను. అమ్మాయిని పరిగా మాపా

చూసు కాస్త జాగ్రత్త అని అంటూ కొంటెగా చూశాడు.

'మీ కాఫీసరుగా ప్రమోషనొచ్చిందా? చెప్పరేమండి.'

'శ్రీమతిగారు చెప్పనిస్తేనా. మూతి బిగించుకుని కూర్చుంటే యెలా చెప్పేది. ఇందాకానే ఈ విషయం ఫోన్ చేశాను. అంతా కులాసాయేనట అక్కడ. ఇవాళ పెద్ద పార్టీ అది ఏర్పాటు చేశారు. అందుకని మన సినిమాపార్టీ కేన్సిలయింది. పోనీ సెకండ్‌షోకి వెళదామా?'

'సినిమావద్దు ఏదీవద్దు. చల్లనివార్త చెప్పారు...ఇంతకీ జీతం ఎంత?'

'మీ ఆడవాళ్ళు దగ్గిర వచ్చిన గొడవే అది. జీతంలోను డబ్బులోను యేముంది? అంతా మానవుడు సృష్టించుకున్నదే. ఇవాళ ఈ రూపాయికి విలువలేదు అంటే కొద్‌వింకా ఇవే.'

'అబ్బబ్బ...లెక్చరివ్వక ఎంతో చెప్పండి' సుశీల.

'ఆరువందలు' రామం.

సుశీల ముఖంలో గర్వం తొంగి చూసింది. అంటే తనిప్పుడు ఆఫీసర్ భార్య!

కాలింగ్‌బెల్ మోగడంతో సుశీల వెళ్ళి తలుపు తీసింది. కుర్రాడొకడు బోల్డు పేకట్లు తెచ్చి అక్కడ పెట్టి వెళ్ళిపోయాడు.

'ఇవన్నీ యేమిటండి?' అంటూ అడిగిన సుశీలకు రామం చెప్పాడు.

'నేను ముఖ్యంగా యీనా సుఖం పొందడానికి ఒకవిధంగా యీ ఆఫీసర్ పోస్టు రావడానికి కారణం మా రామనాధం మాస్టారే' ఆ కథంతా సవిస్తరంగా చెప్పి వాళ్ళ ప్రస్తుత పరిస్థితి కూడా వివరించాడు.

# గురుదక్షిణ

'ఆయనకు యేదోవిధంగా మన కృతజ్ఞత తెల్పడం మన కనీస ధర్మం. డబ్బిస్తే బాగుండదు. పైగా తీసుకోరుకూడా. అందుకని వాళ్ళ కుటుంబానికి బట్టలు, మాస్టారికి చేతిక్కర్ర అవీ పట్టుకొచ్చారు' ఆమె ముఖంలోని భావాలను చదువుతూ చెప్పాడు రామం.

'అంటే...ఆరోజు మనం సినిమా ప్రోగ్రామ్ వేసికొన్న రోజున కన్పించారు... ఆయనేనా?'

'అవును... బాగున్నాయా? చూడు' అంటూ పాకెట్లు విప్పి చూపించాడు, సుశీల కూడ భర్త నభినందించింది ఏదో ఒక సెలవురోజున వాళ్ళని భోజనానికి పిలిచి బట్టలివ్వడానికి నిశ్చయించుకున్నారు. ఆయితే మాస్టారుదీని కంగీకరిస్తారో? లేదో? అనే సందేహం మాత్రం రామానికి కలగకపోలేదు.

ఆరోజు శుక్రవారం ఉదయం ఎనిమిదిన్నరైంది. రామం షేవ్‌చేసికొంటున్నాడు. ఇంతలో సుశీ వచ్చి యెవరో వచ్చారని చెప్పింది కూర్చోమని చెప్పి షేవింగ్ ముగించడానికి ప్రయత్నంచేస్తున్నాడు రామం.

మాస్టారు కూర్చున్నాడు. 'తనప్పుడు ఆఫీసరు దగ్గిరికి వచ్చాడు: వాటి తనితో ఆయిపోయాడు? తనదగ్గిర చదువుకున్న రామాన్ని ఆజ్ఞాపించవచ్చు. కాని తను ఆజ్ఞాపించలేదు. రామం ఆఫీసరు, తనో... ఒక గుర్తింపులేని మాస్టరు. తనమాట వింటాడో, వినడో! అతనికింకేం మొహమాటాలున్నాయో! సూర్యానికే గనక ఉద్యోగం రాకపోతే తను గతేంగాను? రాధనొక యింటిదాన్ని చేసి చూసే అదృష్టం తనకుంటుందా? ఈ ఉద్యోగంలోనే దాని జీవితం వెళ్ళిపోతుందా? హే ... భగవాన్— బారంగా నిట్టూర్చుదామనుకున్న మాస్టారు 'నమస్కారం మాస్టారూ' అనడంతో ఉలిక్కిపడ్డారు.

ఆయన్ని చూసి చాలారోజులవడంవల్ల, ఆయనలోని మార్పులు స్పష్టంగా కనబడుతున్నాయి. బాగా చిక్కిపోయారు. అదే మాటంటే వేదాంతిలా నవ్వారు మాస్టారు. 'నీతో ఒక చిన్నపనుండి వచ్చానోయ్' రామం 'చెప్పండి...!' అని 'సుశీలా! మాస్టారికి కాఫీ తీసుకురా' అని 'మేమే మీ యింటికి వద్దామనుకుంటున్నాము. మీ చలవవల్ల నాకు ఆఫీసరుగా ప్రమోషనొచ్చింది. మాస్టారూ!' అంటూ స్వయంగా కాఫీ నందించాడు రామం.

మళ్ళీ రామమే 'ఇది నాకు వచ్చిందంటే నేను గొప్పగా భావించటం లేదు. ఆనాడు మీవద్ద నా అధ్యయనమే జరగకపోతే నేనీస్థితి కొచ్చేవాడిని కాదు. దానికి కృతజ్ఞతగా మిమ్మల్ని యిక్కడకు పిలిచి ఉడతాభక్తిగా యేదో గురుదక్షిణ సమర్పించుకుందామనుకుంటున్నాము మాస్టారూ!' అంతా గ్రాంధికం మాట్లాడానా? అన్న సందేహంతో అన్నాడు రామం మంచినీళ్ళు తాగినట్టు.

కాని మాస్టారికి కాఫీ గొంతుక దిగలేదు. వచ్చిన విషయం యెలా ప్రస్తావించాలో ఆయనకు బోధపడటం లేదు. అంతకుముందే వ్రాసి తెచ్చుకున్న కాయితం యిచ్చారు.

'నే వస్తానోయ్ ... రామం' అంటూ పిలుపుకోదకుండా వెళ్ళిపోయారు మాస్టారు.

రామానికి మాస్టారి ధోరణి యేమీ అర్థం కాలేదు. వణుకుతున్న చేతులతో ఉత్తరం విప్పి చదవడం ప్రారంభించాడు.

'రామానికి ఆశీస్సులు,





నీవు ఆఫీసరు వయ్యావని తెలిసింది. ఎంతో సంతోషించాను. నాచే పెంచబడిన తోటలో పారిజాత కుసుమము పరిమళించిందని సంతోషించాను. దీనికి నీ ప్రతిభ, కార్యదీక్షలే కారణాలు. నేను కేవలం నిమిత్తమాత్రుణ్ని.

## గురుదక్షిణ

మీ ఆఫీసులో ఒక గుమాస్తా ఉద్యోగం ఖాళీ వుందని అది నీ చేతిలో వుందని తెలుసుకున్నాను. సెకండ్‌క్లాస్ వాళ్ళే దీనికి అప్లై చేయాలని ప్రకటనలో వుంది. కాని మన సూర్యానికి థర్డ్ క్లాసే వచ్చింది. నీవు తల్చుకొంటే వాడికి ఉద్యోగం వేయించి మా జీవితాన్ని ఒక కొలిక్కి తేగలవనే ధైర్యం నాకుంది. ఇది ముఖతః అడగడానికి నాకు మనస్కరించలేదు. ఇది నేనెటువంటి స్థితిలో అడుగుతున్నానో తెలిసికోగలవనుకుంటున్నాను.

నువ్వు నన్నేదో అందలం ఎక్కించాలని గురుదక్షిణ ఇస్తానని యేవేవో చెప్పావు మొన్న మనం కల్సుకున్నప్పుడు. కాని నేను వాటికి అర్హుణ్ని కాదు. నీవు గనక నే నడిగిన యీ ఉపకారం చేస్తే గురుదక్షిణ యిచ్చినట్టుగానే భావిస్తాను. కానీ సహాయం చేస్తే అదేచాలు రామం నాకు అదేచాలు.

ఆశీస్సులతో
అభాగ్యుడు
రామనాథం.

రామం నిశ్చేష్టు డయ్యాడు. తల తిరిగినంత పనైంది. సోఫాలో కూలబడ్డాడు. 'తనను తన జీవితాన్ని సరిదిద్దిన మాస్టారేనా యిలా వ్రాస్తున్నది?' చిన్నతనంలో జరిగిన సంఘటన మదిలో మెదిలింది. అప్పటి మాస్టారిమాటలు చెవిలో గింగురుమన్నాయి. '...అందరిని సమానంగా చూడు పక్షపాత వైఖరి కెప్పుడు చోటివ్వకు' అంటే పరిస్థితులు మానవుణ్ని యెంత దారుణంగా లొంగదీస్తాయో తెలిసింది రామానికి. ఆ ఉద్యోగం తనచేతిలో వున్నమాట వాస్తవమే. కాని దానికెంతో మంది ఫస్టుక్లాసు వాళ్ళే అప్లై చేశారు. వాళ్ళని వదిలేసి సూర్యానికి ఉద్యోగం యెలా యిప్పించగలడు తను? నిజానికిలా ప్రవర్తిస్తే చుట్టూవున్న జనం తనని అన్యాయకుడిగానే అంచనా వేసుకొంటుంది. కాని అదే లేకపోతే తానీ స్థానానికి వచ్చేవాడా!' రకరకాల ఆలోచనలతో అతని మనస్సు వికలమై పోతూంది.

'ఆఫీసుకి టైమవుతుందింకా ఇలా కూర్చొన్నారేమిటి' అంటున్న సుశీలతో లోపలికి వచ్చిన రామాన్ని టేబిల్‌మీద వున్న గురుదక్షిణ వెక్కిరించింది. ●

**దినవర్ధాలూ – గుణాలూ :**

# ధనియాలు

మసాలా దినుసులలో ధనియాలొకటి.

ధనియాల రసం లేక చూర్ణం లేక కషాయం చలవచేసి, ఆర్పుతుంది. తలత్రిప్పు, పైత్యవికారం, చర్ధి, ఎక్కిళ్ళు, అరుచి, విదాహం, చాతుర్థిక జ్వరం, మేహం, తరుణ జ్వరం, తాపం వీనిని హరిస్తుంది. బాగా చమట పుట్టనిస్తుంది. పొట్టలోని వాతాన్ని వ్యాప్తి కానివ్వదు. ఆకలి పుట్టిస్తుంది. ఉష్ణం వల్ల గుండెలో పుట్టే నొప్పిని తగ్గిస్తుంది. పొట్టకు బలాన్ని చేకూరుస్తుంది. మూత్రం ద్వారా పడే యింద్రియాన్ని పడనివ్వకుండా అరికడుతుంది.

అధికమైన వేడివల్ల తలనొప్పిగా ఉన్నట్లయితే కాస్త ధనియాలను నీళ్లలో మెత్తగా నూరి నుదిటపై పట్టు వేయండి. తలనొప్పి తగ్గుతుంది.

వట్టి ధనియాలను అధికంగా తిన్నట్లయితే ఉబ్బసరోగం, బుద్ధి మాంద్యం, పరాకు రావచ్చు.

ధనియాలయొక్క దుర్గుణాలకు విరుగుళ్లు:—1. దాల్చినచెక్క, 2. తేనె. 3. లవంగాలు, 4. కోడిమాంసం.

## జీలకర్ర

గరంమసాలా పొడి, చారుపొడి, సాంబారు పొడి ఇత్యాది వాటిలో జీలకర్ర వాడుతూంటారు. ఇకపోతే నో ఔషధంగా జీలకర్రకు చాలా ప్రాముఖ్యత ఉన్నది.

దోరగా వేయించిన జీలకర్రగాని, అలాగా వేయించి చేసిన జీలకర్ర చూర్ణం గాని, జీలకర్ర కషాయంగాని, నీళ్లలో నూరి తీసినగాని, తగు మోతాదులో పుచ్చుకుంటే నికి చాలా మేలు చేస్తుంది. పైత్యం, పైత్యం, తల త్రిప్పు, కఫం, కఫవాతం, దం, జ్వరం, పాండు, రక్తపైత్యం, శూల, అష్టగుల్మలు గల మేలు చేస్తుంది.

మాంద్యం, గ్రహణి, విరేచనాలు అతిసారం, వీనిని పోగొడుతుంది. పొట్టకు వేడినిస్తుంది. దేహోష్ణాన్ని వృద్ధి పొందిస్తుంది. జఠరదీప్తి, వీర్యవృద్ధి, బలము కలుగజేస్తుంది. శరీరంలోని ద్రవపదార్థ కూటమిని కరిగిస్తుంది. కడుపులోని దుర్గంధాన్ని వాతంచేత వచ్చే కడుపుబ్బును, ఎక్కిళ్లను, కడుపునొప్పిని, అజీర్ణాన్ని, అణచివేస్తుంది. స్ప్లీన్ యొక్క ఉబ్బును తీసివేస్తుంది. బాలింతలగు స్త్రీలకు పాలుపడేటట్లు చేస్తుంది. స్త్రీల బహిష్టువడాన్ని క్రమపరుస్తుంది.

మేహం, తలత్రిప్పు, కాళ్ళూ చేతులూ పీకులు ఉన్నట్లయితే— జీలకర్ర సగంవేయించినదీ, సగం పచ్చిదీ, చూర్ణం చేసి, ఈ చూర్ణానికి సమభాగంగా పంచదార కలిపి— ఆవునెయ్యిలోవేసి, బాగా కలియబెట్టి పూటకు పెద్ద గచ్చకాయంత చొప్పున రెండు పూటలా పదిహేను దినాలు పుచ్చుకోండి.

బాగా తలత్రిప్పు, దారుణమైన పైత్యం ఉన్నట్లయితే— జీలకర్రను నిమ్మపళ్ల రసంతో సూర్యపుటమున ఏడుసార్లు భావన చేసి, వయస్సునుబట్టి తగు మోతాదులో పూటకు బేడెత్తు మొదలు పావలాయెత్తు వరకూ పుచ్చుకోండి. తగ్గుతాయి.

తేలు కుట్టిందా? కుట్టినట్లయితే జీలకర్ర, తేనె, ఉప్పు, నెయ్యి తగుపాళ్లలో కలిపి బాగానూరి— ఆముద్దను తెలు కుట్టిన చోట కట్టు కట్టండి. రెండుమూడు గంటలలో బాధ తగ్గుతుంది.

జీలకర్ర అధికంగా పుచ్చుకుంటే, కడుపు బిగబడుతుంది. విరేచన బద్ధం చేస్తుంది. ఊపిరి తిత్తులకు వాత శరీరుల స్పీన్‌నకు నష్టం వాటిల్లుతుంది.

దీనియొక్క దుర్గుణాలకు విరుగుళ్లుగా 1. బాదంచెట్టు జిగురు. 2. జీలకర్ర దోరగా వేయించడం.

సేకరణ **అకుండి నారాయణమూర్తి**

# మీ వస్త్రములను సబ్బుతో ఉతికినంతమాత్రాన చాలదు......







# వస్త్రముల స్వచ్ఛమైన తెల్లదనానికి రాబిన్ బ్లూ వాడండి

మీ తెల్లని వస్త్రములను సబ్బుతో ఉతికినంతమాత్రాన చాలదు. కారణం సబ్బుతో ఉతికితే కేవలం మురికిని, నూనె మరకలను, మరకలను మాత్రమే నివారించ గలదు. కాని వస్త్రములు తెల్లగా లేక నిర్జీవంగా వుంటాయి.

మరి దీనిని నివారించటం ఎలా?

చాలా తేలిక. తెల్లని వస్త్రములను ఉతికిన తరువాత ఒక బొక్కెన నీటిలో స్వచ్ఛమైన బ్లూ—రాబిన్ బ్లూ కలిపి ఆ నీటిలో ఝాడించాలి. మరే యితర బ్లూలు యివ్వలేనటువంటి స్వచ్ఛమైన ప్రకాశవంతమైన తెల్లదనాన్ని రాబిన్ బ్లూ మాత్రమే యివ్వగలదు. ఓ చిన్న ప్యాకెట్టురాబిన్ బ్లూ 100 వస్త్రములకు పైగా అటిరాగలదు. ధరకూడా అతి స్వల్పం.

**నకిలీలు, నకిలీ ప్యాకెట్లు వుంటాయ్, జాగ్రత్తగా గమనించండి.**



# రాబిన్ బ్లూ

మాత్రమే తెల్లని వస్త్రములకు స్వచ్ఛమైన, ప్రకాశవంతమైన తెల్లదనాన్ని చేకూర్చగలదు.

**RCI** రెక్కిట్ & కోల్మన్‌వారి తయారీ

ARBC 72 TEL

ప్రశ్నలని 'ప్రశ్నావళి', ఆంధ్ర పత్రిక వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1 కి పంపాలి.



# వారఫలం

**8 10 1971 శుక్రవారం మొదలు**

**14-10-1971 గురువారం వరకు**

**మేషం:** సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి రాగలదు. ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వారం ఆఖరులో సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహిత్యకళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులభంగా నెరవేరతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిథునం:** కొన్ని వ్యవహారాల్లో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూలత లభిస్తుంది. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**కర్కాటకం:** అన్ని వ్యవహారాల్లోను మీ ఆలోచనలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమకు గురికాగలరు. వారం ఆఖరులో వృత్తివ్యాపారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**సింహం:** వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం ఆఖరులో అకస్మాత్తుగా వ్యతిరేకత యేర్పడుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**కన్య:** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**తుల:** కొన్ని వ్యవహారాల్లో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో వృత్తివ్యాపారాలు తిరిగి అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. విలాస వస్తువులు కొంటారు.

**ధనుస్సు:** వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. సాటివారితో వాదప్రతివాదాలు తగవు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**మకరం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ప్రయత్నించిన ప్రతిపని సులువుగా నెరవేరగలదు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కుంభం:** సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. ఇతరుల నిమిత్తం మీరు శ్రమకు గురికాగలరు.

స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మీనం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్తి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. మీకు మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్ ●

# టాప్ రహస్యము!



క్రొత్త బినాకా టాప్‌లో మాత్రమే ఒక రహస్యమైన పదార్థము ఉంది కనుక యీ టూత్ పేస్టు మీ నోటిలో అన్ని మూలలకు, పళ్ల మధ్య చిన్న చిన్న సందులలోనికి చొచ్చుకొని పోయి, ఆ చోట్లలో ఉన్న సూక్ష్మ క్రిములను నాశనము చేస్తుంది. అందుకనే మీ నోరు రోజంతా సంపూర్ణముగా శుభ్రముగా, పూర్తిగా తాజాగా ఉంటుంది, అలా మీ నోటి ఆరోగ్యమునకు సంపూర్ణ రక్షణ కలుగుతుంది.

ఈ నిదర్శనమును మీరు చూడగలరు! పరిశోధనాగారములో జరిగే యీ పరీక్షను నేడే మీ యింట్లో చేసి చూడండి!



ఒక గాజు గిన్నెను తీసుకొని దానిలో నీరు పోయండి. బొగ్గు గుండను లేక రంగు పొడరును నీటి మీద చల్లండి.



బినాకా టాప్‌ను కొంచెము నీళ్లలో కలపండి. ఆ ద్రావకము ఒక చుక్కను గాజు గిన్నె మధ్యలో వేయండి.



బినాకా టాప్ ఎంత త్వరగా అన్ని వైపులకు చేరి మలినమును పోగొట్టి, ఉపరితలమును స్వచ్ఛముగా, తేటగా చేస్తుందో మీరే చూడండి.




## బినాకా టాప్
... సంపూర్ణ నోటి రక్షణ యొక్క రహస్యము

CIBA Cosmetics




## జ రి గి న క థ

అప్పుడే బి. ఎ. పరీక్షలు రాసిన కృష్ణవేణి తాతయ్య శాస్త్రిగారి టెలిగ్రాము చూచి బయల్దేరి వస్తుంది. రాజశేఖరంతో పెండ్లి చూపులు, తర్వాత వివాహం జరుగుతుంది. రాజశేఖరం చెల్లెలు వివాహానికి మహా మూఢాచార పరాయణులు అయిన అత్తమామల ఆరళ్లు పడలేకపోతుంటుంది. భర్త శంకరం ఆమె కన్నీరు చూడలేని పిరికివాడు. తప్పించుకుని వచ్చిన ఒక స్త్రీకి మధు తన గదిలో ఆశ్రయం యిస్తాడు.

# 3

ఆమె నిట్టూర్చింది. అతనివంక జాలిగా చూపింది. ఆమె ముఖంలో భావాలు ముడివేసుకున్నాయి. భావవిహ్వలతకి హృదయం ఆగిపోయింది. మొదట్లో ఈ సంగతి చివరికీ చెప్పగూడదనుకుంది. కాని ధైర్యంగా తన ప్రాణాన్ని కాపాడిన వ్యక్తికి చెప్పకపోవటమేం ధర్మం? హృదయాన్ని తన్నుకువచ్చే ఈ ప్రవాహాన్ని ఆపటం ఏవరితరం? జీవితంలో ఓడిపోయిన సంఘటనలు ఎన్ని? ఎంతమంది తన జీవితత్వాన్ని తమ కనుకూలంగా త్రిప్పుకున్నారు? ఈ విషవలయంనుంచి తప్పించుకోవాలని ఎంత ప్రయత్నం చేస్తోంది. తన అనుభవాలు ముక్కలు ముక్కలుగా కత్తిరించి చూపించి హేళనగా నవ్వుతుంది సంఘం. ఆ సంఘంలో మొదటినుంచి ద్వేషం చూసింది. అందుకే ప్రపంచ చెడుగానే కనిపిస్తున్నది. కాని లోకంలో కొంత మంచి వున్నది. మంచివాడైనా ఈ వ్యక్తితో చెబితే లాభం వున్నా లేకపోయినా నష్టం లేదు.

'నా పేరు రాణి—' అన్నది.

మధు 'ముందు కూర్చోని చెప్పు' అన్నాడు.

ఆమె గోడకానుకుని కూర్చుంది.

'నా పేరు రాణి, మా అమ్మ పోయింది. నాకు ఇద్దరక్కయ్యలు నలుగురు చెల్లెళ్ళు వున్నారు. ఆఖరుగా ఒక మగపిల్లవాడు పుట్టాడు అమ్మకి. వాడు పుట్టటమే తడవుగా అమ్మ కన్నుమూసింది. అమ్మ పోవటంతో నాన్నకి పిచ్చెత్తినట్లయింది. ఆయన ఆ బాధనుంచి తప్పించుకోటానికి రకరకాల వ్యసనాలు అలవాటు చేసుకున్నాడు. అసలే మాది బీద సంసారం. నాన్న ఇలా మారేసరికి మరింత చితికిపోయింది. ఒకే ఒక అక్కకి ఎలాగో పెళ్ళయింది. మా పరిస్థితి చూడలేక నన్ను మా అక్క తీసుకెళ్ళిపోయింది. కాని అక్కడే నా కష్టాలు మొదలైనయి. బావని చూడటానికి ఎందరో స్నేహితులు వచ్చేవారు. వాళ్ళందరి కన్ను నాపైన వుండేది. బావ రోజూ వాళ్ళ గొప్పతనాన్ని నాముందు పొగుడుతూ వుండేవాడు. తరువాత తెలిసింది బావ ఈ వ్యాపారం చేస్తున్నాడని. నా చుట్టూ ఇనుప సంకెళ్ళు బిగుస్తున్నాయని తెలిసాక పారిపోవాలనుకున్నాను. నాన్నకి ఎన్ని ఉత్తరాలు వ్రాసినా జవాబు వుండేదికాదు. అక్క బావతో పోట్లాడి దెబ్బలుతిని ఏం చేయలేక పోయేది. ఒకటికి రెండుసార్లు ఒక మార్వాడిచేతికి చిక్కి ఎలాగో తప్పించుకున్నాను. ఇక అక్కడ వుండలేక ఒక రాత్రిపూట ఇంట్లోంచి పారిపోయాను. ఎలాగో ఇల్లు చేరుకున్నాను. అక్కడెవరూ లేరు. నాన్న ఇంట్లోంచి లేచిపోయాడని తెలిసింది. అక్కలు, చెల్లెళ్ళు ఎక్కడున్నారో తెలీలేదు. నా మనస్సుకు తేలు కుట్టినట్లయింది, స్పృహతప్పి పడిపోయాను. ఆ ఇంట్లో ఒక లారీ డ్రైవరు వుంటున్నాడు. అతను నాకు ఉపచారాలు చేశాడు. పదిరోజులలో కోలుకున్నాను. అతను నామీద వెర్రి వ్యామోహం చూపేవాడు. పెళ్ళి చేసుకుందామనేవాడు. అప్పటికే అతనికి ఇద్దరు భార్యలు. నేను ఒప్పుకోలేదు చివరికి కోపం వచ్చి ఓ బ్రోకర్‌కి అమ్మేశాడు. వాడు నన్ను ఈ వూరు తీసుకొచ్చి ఈ వ్యభిచార గృహం నడిపే ఓ ముసలివానికి అమ్మాడు. నేనేమీ చేయలేకపోయాను. ఈ ఆరునెలల నుంచి నా పని దిన దిన గండం నూరేళ్ళ ఆయుష్షులా వుంది. ప్రొద్దున్నుంచి ముఖాని కింత పౌడరు పూసుకుని దారినపోయే వాళ్ళని ఆకర్షించటానికి వాళ్ళు చేసే చేష్టలు చూస్తుంటే నా కసహ్యం వేస్తుంది. కాని తప్పలేదు.'

ఆమె కళ్ళు తుడుచుకుంది.

ఆమె అనుభవాలు అతని హృదయాన్ని గాయం చేసినయి.

'చెప్పండి బాబు, మాకు తిండి కావాలి. కూటికన్నా మంచాకాల్లా మేం జీవించలేం' అన్నది రాణి.

మధు మాట్లాడలేదు. ఈ ప్రశ్న సూటిగా అతని హృదయాన్నే పిల్చుకు పోయింది. అతనికళ్ళు చెమర్చినయి.

అతన్ని చూసి ఆమె ఆవేశం అణుచుకుంది.

'పడుకోండి బాబు, పాపిష్టిదాన్ని మిమ్మల్ని బాధపెట్టాను.' అంది.

మధు మెదలకుండా పడుకున్నాడు. అయితే నిద్ర పట్టలేదు.

తెల్లవారు రాణి ఊరికే పడుకునే వుంది. ఏమిటో కలలు విశ్రాంతి లేకుండా చేస్తున్నయి. ఆ భయంకర వాతావరణం లోంచి బయటపడగలదా తను? ఈ శాపానికి విమోచనం ఎప్పుడు? ఇంకా ఈ చీకట్లో ఎంతకాలం వుండగలదు?

తనకు వారికి ఏ సంబంధము లేక

కోగానా తనమీద సర్వాధికారాలు వాళ్ళు సంపాదించుకున్నారు. వాళ్ళ చేతుల్లో దెబ్బలు తిననిరోజు లేదు. తన కన్నీరు వాళ్ళలోని పశుత్వాన్ని చంపి మానవత్వాన్ని నింపలేదు. ఎందరు వ్యక్తుల్లో ఈ కొద్ది కాలంలో తారసిల్లారు. ఎందరో తన మూలంగా నాశనమైపోతున్నారని తెలిసి బాధపడింది. క్షణికానందం కోసరం ఆత్ర పడే వారిని చూసి జాలిపడింది. తనది ఆ కాసేపు మిథ్యాభినయమే. అందులో సత్యంలేదు. స్త్రీ పురుషుని కువగ్రహంలా చరిస్తే అదో అందమైన అనుభూతి. కాని తను ?

ఆమెకు ఏడుపు వచ్చింది. శక్తిలేదు గాని తను చేస్తున్న పాపానికి భూమిలోకి దిక్కుడికో పోయి తల దాచుకోవాలి. ఇంత గొప్ప వ్యథ ఈ రోజే కలిగింది. బహుశ ఈ మంతనం ముందు తను వోడి పోవటంవల్లనేమొ? త్రాగివచ్చి స్వంత భార్యని కొట్టినట్లు కొడుతుంటే నోరెత్త లేదు తను. ఈనాడు ఈ మంచితనానికి హృదయం ద్రవించిపోతున్నది.

ఇక రాణి ఆలోచించలేక పోయింది. క్రమంగా ఇద్దరికి నిద్రపట్టింది.

ఆమె కనులు మూతలు పడినయి. దేవ తల చిరునవ్వులాంటి నిద్ర అమాయకంగా ఆమెను లోబరుచుకుంది. ఆమె ఆలోచనలు స్తంభించినయి.

కాని ఆమె చెప్పిన ఈ విషాద కథ జాగృతమయ్యే వుంది. ఈ గది నాలుగు గోడలలో, చీకటి అణువులలో దాగి వుండి ఘనరా్యశవహౌనునే ంగ

తెల్లవారిపోయ్యేసరికి తూర్పు దిక్కున జ్ఞానజ్యోతిలా ప్రకాశించింది సూర్యబింబము.

రాణి కళ్ళమీదికి సూర్యకాంతి పడే సరికి లేచి కూర్చుంది.

అప్పటికే అతను లేచాడు.

'ముఖం కడుక్కోండి. కాఫీ తెప్పిస్తా' అన్నాడు.

రాణి పేలవంగా నవ్వి. 'మీకు శ్రమ ఇస్తున్నాను' అంది.

'శ్రమేముంది?' అన్నాడు మరో మాట తోచక.

ఆమె ముఖం కడుక్కోటానికి బాత్ రూంలోకి వెళ్ళింది.

హఠాత్తుగా అతని మనస్సు మేలుకున్నది.

ఆదే సమయంలో రాణికూడ జీవితంలో మొదటిసారిగా మెరుపు చూసుకున్నది.



'కాఫీ తీసుకోండి.'

ఆమె వణికే చేతులతో గ్లాసు అందు కుని త్రాగింది.

'కొన్ని కలలకి రూపమేగాని అర్థ ముండదు. ఇదీ అలాంటిదేమోనని భ్రాంతి పడుతున్నాను. అదే నిజమైతే దానికి వ్యాఖ్యానం వుండదు ఇది కల అయినా నిజమైనా ఈ రోజు ఎంతో తృప్తిగా వుంది. మిమ్మల్ని మరిచిపోలేను. వస్తాను బాబు' అంది రాణి.

'ఎక్కడికి పోతారు? మళ్ళీ వాళ్ళకు కనిపిస్తే—'

రాణి నవ్వింది.

'భయంలేదు బాబు. మనిషికి ఉద్రేకం ఎంత త్వరగా వస్తుందో అంత త్వరగాను చల్లారిపోతుంది. అసలీపాటికి అంతా మరిచి పోయి వుంటారు. మీరు మాత్రం నాగురించి బాధపడకండి. ఏ దురదృష్టం నాకీ జీవితాన్ని ప్రసాదించిందో దాని కళ్ళవాటు పడిపోయాను. ఈ క్షణం నా జీవిత గ్రంథంలో క్రొత్త పుట అతికించ బడినట్లుగా వుంది.'

అతని కళ్ళలో ముత్యాల బిందువులు నిలిచినయి. ఆమె కళ్ళలోంచి నీటి బిందువులు గదిలో చరిత్రను సృష్టించుకుంటున్నయి.

'వస్తాను బాబు.' అంది వెళ్ళిపోతూ.

కన్నీటి తెరలోంచి ఆమె నిష్క్రమణని చూస్తూ నిలబడిపోయాడు.

* * *

నరసమ్మ కీ మధ్య మీనాక్షి మీద కోపం ఎక్కువయింది. పెద్దకూతురు సుందరం వచ్చినప్పటి నుంచి మరీను. గత ఇరవై రోజుల నుంచి శంకరంలో అద్భుతమైన మార్పు కనిపిస్తున్నది. అయితే ఆ మార్పేమిటో స్పష్టంగా గ్రహించలేకపోతున్నది. 'మిడిలో చైతన్య మెక్కడిది?' అని తనే ప్రశ్నించింది ఒకనాడు. కాని ఆ 'మట్టి లో ఒక చైతన్య స్రవంతి బయలు దేరి జీవితాన్ని తేజోవంతం చేస్తు న్నదనీ, అందులో విప్లవం ప్రారంభమైందనీ, అందుకు కారణం మీనాక్షి పనే. సందేహం

రోజులాగే ఆ రోజు ఉదయం సరిగ్గా సమయానికి మీనాక్షి లేవలేదు. అనేకసార్లు పిలిచి, తలుపులు తట్టి, గదులన్నీ చూసి 'ఆ మహా రాణి లేవలేదా ఇంకా?' అంది.

కాని మహారాణి జవాబు చెప్పలేదు. మహా రాజా చెప్పాడు కాస్త చురుగ్గానే.

'లేదమ్మా. ఒంట్లో బాగులేదు. పడు కుంది.'

'ఏ మోహం. ఒంట్లో బాగుండక పోవటమేమిటి? అదోవంక. నాదగ్గరనా ఇవన్నీను. అయినా పనులు చేసుకోవటం అంత బద్ధకమైతే ఎట్లాగురా? వెంటనే మొగుడి వేషాలు వెయ్యక రమ్మను దాన్ని. ఈ రోజు పని మనిషికూడ రాదు.'

శంకరం జవాబు చెప్పలేదు.

నరసమ్మ పదినిముషాలు చూసింది. మీనాక్షి రానేలేదు. ఇక ఆవిడకే తప్పలేదు.

మరోసారి అయితే ఆవిడ ముసుగుతన్ని పడుకునేదే. కాని ఈ రోజు కూతురు సుందరం వస్తున్నది. దానికోసరమైనా

## కాఫీ

కం. కాఫీ గద దైవంబిల
కాఫీగద జనులకెల్ల గణనీయంబౌ
కాఫీ లోకము దెలుపును
సాఫీగా జీవితంబు సాగించునిలన్.

సీ. వివరింతునే గొప్ప విశదవాక్యంబుల
కాఫీ కషాయంపుకథనమనగ
జ్ఞాన బుద్ధిని దోచి తనువులకృశియింప
సాయమ్మొనర్చునీ సానిజాయ
సంసారముల గూల్చి సన్యాస మిప్పింప
సారవంతము, దీని సాటిగలదె
అధికారమును స్థైతమణగ ద్రొక్కింపగ
మించదేదియుదీని మంచిజూచి

తే. జన్మ జన్మలవీడని జన్మమనగ
సర్వమానవ సమ్మోద శరణమెరిగి
జీవితమ్ముల నంధంబు జేవురింప
సాధ్యమొసగును నియ్యది సర్వమాన్య.

తే. కాఫి నామమె నిత్యమ్ము కలచుచుండ
కొంపలన్నియు దానికై గుల్లగాగ
పరుల కొంపల యాచింప బంపునిదియ
దాని భావంబు తలపంగ తరమెమనకు.

తే. నేటి యీ కాఫి మహిమంబునెంతుమన్న
సాధ్యమగునే యనెడు నోసందియమ్ము
పతిత పాశ్చాత్య వాసనాయుతముమనము
ఏమి నెప్పుడు సేవింప నేపటంచు.

—యస్. యస్. ఆర్. మోహనశర్మ

చేయక తప్పదు

ఇక మామూలు ధోరణిలో మొదలు పెట్టింది. నిజానికి మీనాక్షికి లేస్తే కళ్ళు తిరుగుతున్నయి. ఒకటే వికారం. రాత్రి నుంచి ఎన్నిసార్లో వాంతులయినయి. తలంతా పోటుగా వుంది. జ్వరం వచ్చి నట్లుగా వుంది. ఒళ్ళంతా నొప్పులు. ఏమైనా స్నానం చేసే స్థితిలో లేదు.

రాత్రి అతని కంగారు చూసి మీనాక్షికి జాలి, ఏడుపు, నవ్వు, ఆనందము—కలిగి నయి. ఇన్నాళ్ళకి అతని ముఖంలోని తనమీద ఆపేక్షని స్పష్టంగా గుర్తించగలిగింది. ఆ క్షణం అంత బాధలోను ఏదో ఆనందం.

'నిజం చెప్పు మీనా, ఎలా వుంది ఒంట్లో? డాక్టరు దగ్గరికి పోదామా? నాకేమిటో భయంగా వుంది.' అని అమాయ కంగా అంటూంటే కరిగిపోయింది. అతని కళ్ళల్లో నీళ్ళు చూసి—

'ఛీ, ఏడుస్తారా ఎక్కడైనా? ఎందుకు? ఏమైందని ఇప్పుడు? నేను బాగానే వున్నాను. మీరు ఊరుకోవాలి. ఊరుకోవాలమ్మా. ఏదీ ఇటు చూడండి. నవ్వండి—'

శంకరం ఆపుకోలేకపోయాడు.

'మీనా. నేను పిరికివాణ్ని. భార్యను సుఖపెట్టలేని అసమర్థుణ్ని.' అన్నాడు గద్గదస్వరంతో ఆవేశంతో.

'ఛ, ఎవరన్నారు? మీరు ధైర్యవంతులు.' అంది అతని గుండెల చప్పుడు వింటూ.

అసలు శంకరం ఈ మాటెందుకన్నాడో అతనికే తెలియదు. కాని కొద్ది రోజులుగా అతని హృదయంలో బలీయమైన సంఘ ర్షణ జరుగుతున్నది. భార్య కన్నీరు గుండెల మీద పడినకొద్దీ ఆ సంఘర్షణని ప్రారం భించింది.

'పిచ్చిదానా, ఎందుకలా వంచన చేసు కుంటావు? ఈ ఇంట్లో నేనొక యంత్రాన్ని. నెలంతా పనిచేసి జీతంరాళ్ళు తెచ్చి సంసా రాన్ని లాగే ఇంజనుని. నువ్వు—? నువ్వు వో దాసీదానివి. అదే నయం. దానికున్న గౌరవం కూడ లేదు. నీకీ ఇంట్లో? ఛీ— ఇది ఇల్లా—వల్లకాడా?'

శంకరం ఆవేశం ఆపుకోలేకపోయాడు.

మీనాక్షికీ ధోరణి క్రొత్తగా వుంది. విన్నో ఏళ్ళనుంచి పేరుకుపోయి ఇక భరించ లేక ఈ ఆవేదన అతని గుండెని బ్రద్దలు

చే...కువి వచ్చిందని మీనాక్షికి తెలియదు. ...వ కన్నీళ్ళు ఎన్ని గుండెల్లో ...విరె అత్నీ ...తికి తెచ్చినయ్యో అర్థం చేసుకోలేదు.

'ఏమండీ. నామాట వినండి. ఇది మీనాక్షి. మనిషిని మనిషిట్లో మనం చేసుకోవటం తప్పా? ఆకాశానికి మీరోయంత్రమని నేనో దాసిదాన్నని ఎందు కనుకుంటారు?' అన్నది

శంకరం మాట్లాడలేదు. అతని ముఖం విరగా కందిపోయింది.

ఇన్నాళ్ళు ఎన్నివేశాకోళాలు భరించాడో

'వాడెక్కడ వస్తాడు. అమ్మనంపద్దూ?

---

విటమిన్లు మరియు ఖనిజములు మీ కుటుంబముయొక్క ఆరోగ్యమునకు ఎంతో అవసరము

## వారికి తగినన్ని లభిస్తున్నాయా?




విటమిన్లు మరియు ఖనిజముల లోపముతో మీ కుటుంబపు ఆరోగ్యము పాడవవచ్చును. ఆలసట, బలుపు, ఆకలిలేకపోవడము, నిరుత్సాహము, చర్మము మరియు పళ్ల బాధలు మొదలైనవన్నీ అవసరమైన విటమిన్లు మరియు ఖనిజముల లోపమువల్ల మామూలుగా కలుగుతాయి అయినా విటమిను మరియు ఖనిజములను గురించి అశ్రద్ధ చేయబడుతుంది ఎంతో జాగ్రత్తగా ఆలోచించి తయారుచేసిన ఆహారములో కూడ. సమృద్ధియైన ఆహారమును సరియైన ఆహారము అనుటకు వీలులేదు. ఎన్నో రకముల ఆహారములలో కూడ విటమిన్లు మరియు ఖనిజములు లోపించవచ్చును. కనుక, మీ కుటుంబమునకు ఎంతో అవసరమైన విటమిన్లు మరియు ఖనిజములు తగు పరిమాణములలో లభిస్తున్నాయని ఎలా, నిశ్చయము చేసుకోగలరు?

మీ కుటుంబములో ప్రతి ఒక్కరికి నిశ్చయముగా యీ అవసరమైన పోషక పదార్థములు వారికి కావలసిన పరిమాణములలో లభించుటకు, వారికి విమ్‌గ్రాన్—స్క్విబ్ వారి వివిధ విటమిన్లుమరియు ఖనిజములుగల బిళ్ల నివ్వండి. రోజూ ఒక బిళ్ల చాలును. ఈ ఆరోగ్య సూత్రమును నేడే ఎందుకు అలవాటుచేసుకోకూడదు?

విమ్‌గ్రాన్‌లో పదకొండు ముఖ్యమైన విటమిన్లు మరియు ఎనిమిది ఖనిజములు ఉన్నాయి. పుష్కలమైన పరిమాణములో. ఇనుము ఎఱ్ఱ రక్త కణములను సంపాదిస్తుంది మరియు శక్తిని తిరిగి కలిగించుటలో సహకరించును. కేల్షియమ్ ఎముకలను మరియు పళ్లను బలిష్ఠముగా ఉంచుతుంది. విటమిను సి జలుబు రాకుండా అడ్డుతుంది. విటమిను ఎ దృష్టిని బాగుగా మరియు చర్మమును ఆరోగ్యవంతముగా ఉంచుతుంది. విటమిను బి-12 ఆకలిని అధికము చేస్తుంది మరియు సహనశక్తిని కలిగిస్తుంది—ఇంకా, మీ కుటుంబముయొక్క ఆరోగ్యమునకు ఎంతో అవసరమైన యితర ముఖ్యమైన పోషక పదార్థములు ఉన్నాయి.

# విమ్‌గ్రాన్®

'వివిధ విటమిన్లు మరియు ఖనిజములుగల బిళ్లలు'

**11 విటమిన్లు మరియు 8 ఖనిజములు కలది.**

**ఒకే ఒక విమ్‌గ్రాన్ మిమ్మల్ని రోజంతా శక్తివంతముగా ఉంచుతుంది.**

SQUIBB® SARABHAI CHEMICALS

Shilpi-HPMA-25A/71 Tel

వాన్ని డబ్బివ్వదూ' అంటూ నవ్వుకుంటూ స్నేహితులందరు సినిమాలకి పోతున్నప్పుడు అతని అహం దెబ్బతిని, అభిమానంతో చచ్చిపోయాడో ఎవరికి తెలుసు?

అదే ఆ ప్రపంచమే వెక్కిరించి విశ్వాన్ని రెచ్చగొట్టింది. ఇందులో ఒక్క మీనాక్షి కారణం కాదు.

'కాస్త ఓపిక పట్టండి. మీకు పుణ్యం వుంటుంది' అంది బతిమాలుతున్న ధోరణిలో. భర్తలో యీ మార్పును హర్షించినా రేపు అత్తగారు మామగారు తననే అంటారని భయపడింది మీనాక్షి.

శంకరం మీనాక్షి మాటను వినలేదు. కాని కాస్త తగ్గాడు. అతని ఆవేశం కొంత వరకు చల్లారింది.

'నువ్వేమీ పనిచేయకు. ఈ పూట స్నానం కూడవద్దు. నేను డాక్టరుని తీసుకు వస్తాను. అన్నానికి తప్ప దేనికైనా లేచావా నామీద ఒట్టే.'

మీనాక్షి ముఖంలో రంగులు వెలిగాయి.

'ఎందుకండీ డాక్టరు? అదే తగ్గుతుంది!' అంది.

'కాదుమీను. నువ్వు అశ్రద్ధ చేయకూడదు.'

'అశ్రద్ధేమీలేదు. జబ్బుంటేగా అశ్రద్ధకి--' అంది.

'జబ్బులేదంటావేం? రాత్రంతా వాంతులతో నా ప్రాణంతీసి' అన్నాడు మీనాక్షి తల నిమురుతూ,

# అమృత కలశం

'మీకు తెలీదు పొండి' అంది దిండులో ముఖం దాచుకుని మీనాక్షి.

శంకరానికేమీ అర్థంకాలేదు.

భర్త వెళ్ళిన దిక్కే చూస్తూ నవ్వుకుంది మీనాక్షి.

శంకరం తొమ్మిది కావటంతోనే స్నానం చేసి వంటింట్లోకి తొంగిచూశాడు.

'వంటకాలేదు నాయనా ఎట్లా అవుతుంది? పగలుకూడ గదిలో దూరి పడుకుంటే. అయినా నాకెందుకు? అదేమని అడిగేరోజులా ఇవి? నీకెట్లాగో పాపం. అయినా మొగుడికి ఇంత వండిపెట్టాలని తెలీదూ పతివ్రతాశిరోమణికి. మా సంగతి సరే అట్లా వుంచు.'

శంకరం వినిపించుకోలేదు.

అద్దంముందు నిలుచుని తల దువ్వుకుని వెళ్ళిపోయాడు.

కొడుకు వెళ్ళిన వంకే చూస్తూ 'అవురా! పోయేకాలం. మొక్కలైనప్పుడు పిల్లలుగాని మానులైనప్పుడు పిల్లలా. కాలం. ఇట్లాంటివాడ్ని నేనెక్కడా చూడలేదమ్మా. పెళ్ళాన్ని వెనకేసుకొచ్చి నన్ను నానామాటలు అంటాడు' అంది.

శివనాథం జపం ఇప్పటికి పూర్తయింది.

'అవునే ఊరికే అన్నారా, పెళ్ళాము బెల్లము తల్లి తండ్రి అల్లము—అని వీరబ్రహ్మంగారు చెప్పినవన్నీ జరుగుతున్నాయి. కలికాలం మనింట్లోనే ప్రారంభమైంది. అయినా మనబంగారం మంచిదైతే కంసాలి మీద పడి ఏడవడ మెందుకని—ఏమిటో?' అన్నాడు సహం వేదాంతంలో—

'సరే మీరు త్వరగా తెమిలి స్టేషన్‌కి వెళ్ళిరండి అమ్మాయొస్తుంది!'

'ఆఁ! రెండు నిముషాలు.'

'నేను వద్దామనే అనుకున్నా. కాని ఈ దాసి పని ఎవరు చేస్తారు? నేను ఏ అత్తింటి కోడలినేగాని ఇట్లా పడుకొని ఎరుగను. చేసుకున్న వాళ్ళకి చేసుకున్నంత మహాదేవ. జరిగే వాళ్ళకి జరుగుతయిగాని అందరికీ జరుతాయా?' అని సణుగుతూ కోపమంతా ఎసినక్రమీద చూపెట్టి దబదబ బాదడం మొదలుపెట్టింది. మీనాక్షి కన్నీ వినపడుతునే వున్నాయి. ఏం చేయలేక పడుకుంది.

* * *

మరో రోజు—

సుందరంవచ్చి నాలుగు రోజులయింది. వచ్చిన మొదటిరోజు రాత్రే చావు కబురు చల్లగా చెప్పింది.

'అమ్మా ఆయన ఇక్కడే స్థిరపడదామనుకుంటున్నారు. ఈ వూళ్ళోనే ఏదైనా వ్యాపారం పెట్టి మీ అండన ఉండాలని ఆయనకి గట్టిగా వుంది.

'ఆ వూళ్ళో ఏదో వ్యాపారం చేస్తున్నాడుగా?' అంది నరసమ్మ.

'ఆఁ! వుందిలే నా ముఖం. అందరు మొహమాటం. వ్యాపారమన్నాక నిష్కర్ష వుండాలి. అందరూ స్నేహితులు ఆయనకి. నిష్కర్షగా వుండరు. నేనేదైనా అంటే 'స్నేహితుల్ని ఏమడుగుతాం, ఇస్తార్లే.' అంటారు. ఇచ్చినవాళ్లు ఇస్తారు. లేనివాళ్ళు లేదు. ఏం బాగుపడతాం?' అన్నది సుందరం.

కాని అసలుసంగతి అదికాదు. సుందరం భర్తకి ఓ 'మంచి' లక్షణమున్నది. అతను పేకాట అంటే అన్నము నీళ్ళు మరిచిపోతాడు. ఇతర ధ్యాస వుండదు. ఆ ధ్యాసలోంచి తప్పించాలని చూసింది సుందరం. ప్రయోజనం లేకపోయింది. అయితే మంచికో చెడుకో అన్నదమ్ములు వేరుపడ్డారు. అప్పటికి సుందరం భర్త చేసిన అప్పులు చూస్తే మూడు ఎకరాలు అమ్మితేగాని తీరేటట్లులేవు. సుందరం తెలివైనపని



చేసింది. ఋణం పెరగటం మంచిదికాదని పొలము అమ్మేసి తీర్చేసింది. ఇక పొలము మిక్కుచ లేదు. ఇక ఆవూళ్లోవుంటే భర్త బాగుపడటం కలలోమాట. పేకాటకి వ్యయంగా అన్నలే ప్రోత్సహిస్తుంటే ఏ తమ్ముడు బాగుపడతాడు? ఇక ఇలా కాదని ఏమైతే అదయిందని పుట్టింటికి తీసుకొచ్చింది మొగుడ్ని. అయితే ఈ సంగతంతా చెప్పి భర్తను తేలిక చేయదలచుకోలేదు సుందరం.

'అనీగాక అవి పదిమందిపీద తిండి. ఏం వంటబడుతుంది? ఆయన ఆరోగ్యం చూడబోతే నీకు తెలియందేముంది? మేం రావటం ఆ ఇంట్లో నెవరికీ ఇష్టంలేదు. కాని మనసంగతి మనం చూసుకోకపోతే వీరు చూస్తారు? అందుకని నేనే ఆయన్ని ప్రోత్సహించి తీసుకువచ్చాను. మీరేమైనా అనుకుంటారేమోనని ఆయనకు మనసులో సందేహంగా వుంది. నేనే 'అమ్మ అలాంటిది కాదు. ఏమీ అనుకోదు.' అని చెప్పి ఒప్పించాను.'

'ఎందుకు అనుకోటం? ఇది మాత్రం నీ ఇల్లు కాదూ' అంది దీర్ఘం తీస్తూ వరసమ్మ.

తల్లి ఈ మాట అనేసరికి సుందరానికి ధైర్యం వచ్చింది.

'అందుకనే నాన్నతో చెప్పు.'

శివాధమయితే సరే వన్నాడు గాని శంకరానికి బొత్తిగా ఇష్టం లేదు. ఇష్టం లేదని చెప్పటానికి ధైర్యం లేదు. సుందరం తన స్థానం స్థిరపరుచుకుంటున్నది మాటల్లోను చేతల్లోను.

'పూలన్నా తేవేమిరా తమ్ముడూ?' అంది వో రోజు సాయంకాలం.

శంకరం నవ్వి 'బాగుందేవ్ అక్కయ్యా' నువ్వు చెప్పింది. పూలు పెట్టుకోటానికి మనమేం భోగంవాళ్ళమా? ఇదేం సంసారుల కొంపా, సానుల కొంపా? పూలు గీలు పెట్టుకుని ముఖానికింత పౌడరు పూసుకుని బజార్నవెంట వూరేగాలంటే కుదరదు.' అన్నాడు.

శివాధం మనస్సు స్పిరిట్‌తో తడిసిన దూది మీద అగ్గిపుల్ల పడితే భగ్గుమన్నట్టు మండింది.

వీడెంత తెలివి మీరాడు?

సుందరం తమ్ముడివంక విస్తుపోయి చూసింది.

'ఆశేం మాటలురా!' అంది చివరికి




ఆయింట్‌మెంటులు, పూతలు, మామూలు బిళ్లలూ—ఇవన్నీ పాత తరహావి. అవి పని చెయ్యటానికి ఎంతో కాలం తీసుకుంటాయి. అంతకాలమూ మీరు బాధను అనుభవించాల్సివస్తుంది. ఏమాత్రం తలనొప్పి గాని, ఇతర నొప్పులు గాని కలిపించగానే మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో' తీసుకుంటాను. అంతే! నొప్పి చిటికెలో తగ్గిపోతుంది.

నొప్పిని తగ్గించేటందుకు మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో' శాస్త్రీయమైన ఆధునిక నివారణ. 'మైక్రోఫైన్డ్' అంటే ప్రతి 'ఆస్ప్రో' బిళ్ల 150 మిలియన్ల అతి సూక్ష్మమైన అణువులను కలిగి ఉండటం. ఈ అణువులు అతి త్వరగా కరుగుతాయి, ఇముడుతాయి, అంతే త్వరగానూ నొప్పిని తగ్గిస్తాయి. మీకు సత్వర నివారణ కలిగించేటందుకు మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో' మామూలు బిళ్లలకంటె రెట్టింపు త్వరగా పనిచేస్తుంది.

అనవసరంగా బాధను అనుభవించకండి—మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో'ను తీసుకోండి.

మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో'ను- నొప్పి · తలనొప్పి · ఫ్లూ · ఒళ్లు నొప్పులు · జలుబు · కీళ్లనొప్పులు · గొంతునొప్పి · పంటినొప్పులకి వాడండి.

మోతాదు: పెద్దవారికి: రెండు బిళ్లలు, అవసరమైతే మళ్లీ వేసుకోండి, పిల్లలకు: ఒక బిళ్ల లేక మీ డాక్టరు సలహానుసరించి వేసి కొనవలెను.




నెమ్మదిగా నివారించును
బిళ్లలోని పెద్ద అణువులు నెమ్మదిగా ఇముడుతాయి. నొప్పి తగ్గటానికి చాలాసేపు పడుతుంది. కనుక అంతసేపూ మీరు బాధ పడాల్సి వస్తుంది.



శీఘ్రముగా ని...
బిళ్లలోని చిన్న ... త్వరగా ఇముడుతా... మూలముగా త్వరగా ... కుంటాయి; ... త్వర... నొప్పిని తగ్గిస్తాయి.



A.G.49 (S) TL

నొప్పిని అతిశీఘ్రంగా తొలగించడానికి 'ఆస్ప్రో' మాత్రమే మైక్రోఫైన్డ్ చేయబడినది.

తేరుకునీ

శంకరం దానికి జవాబు చెప్పలేదు.

'మీనాక్షి, మంచినీళ్ళివ్వు.' అంటూ లోపలికి వెళ్ళిపోయాడు.

మీనాక్షి అతన్ననుసరించింది.

శివనాథం గానీ, వరసమ్మగాని నోరెత్తలేకపోయారు. ఇంత పెద్ద దెబ్బ కొట్టే శక్తి శంకరంలో వుందని ఇద్దరూ వూహించలేకపోయారు.

'వీడు మన చెయ్యిదాటిపోతున్నాడు.' అన్నాడు శివనాథం. అతని కళ్ళు చింత నిప్పులైనయి.

'చూశావా ఆమ్మా ఎంతమాటన్నాడో తమ్ముడు. వాడికి మేముండటం ఇష్టంలేకపోతే పోతాం. అంతేగాని ఇట్లా ఇష్టం వచ్చినట్టు మాట్లాడితే బాగుండదు. మా గ్రహచారం కొద్దీ మీకొంపకి వచ్చాం. పూలుపెట్టుకుంటేనే భోగంవాళ్ళవుతారా' అంది జీరపోయిన గొంతుతో.

అప్పటికే వరసమ్మ గుండె మండిపోతూ వుంది.

సుందరం కన్నీరు అజ్యమైపడింది.

'ఇష్టానికి అయిష్టానికి వాడిదేముందే? ఇది మీనాక్షి ప్రోద్బలం. అసలిదంతా దాని బోధలే తల్లీ. చూస్తున్నావుగా నాలుగు రోజుల్నించి ఇవతల చెంబు అవతలపెట్టటం లేదు. అంతా నేను చూసుకోవాలి. వీడ్ని అలా తయారుచేస్తున్నది. వీడు దానిచేతిలో కీలుబొమ్మ అయినాడు' అంది వరసమ్మ ఉక్రోషంతో.

'మీనాక్షి మారిందా?' అంది ఆశ్చర్యంతో సుందరం.

'అయ్యో నీకేం తెలుసునే తల్లీ, నాలుగు రోజులాగు అన్నీ వంటబడతయి. మాయలమారి. వీడికేదో మందుపెట్టింది.' ఈ కోపం అంతకంతకు ఎక్కువై ఆమెలో యుక్తాయుక్త జ్ఞానాన్ని చంపేసింది. ఆమెకు దాదాపు మతిపోయింది. మీనాక్షికి ప్రతీకారంచేయాలి. ఆ అవకాశం మరునాడు భోజనాలదగ్గర వచ్చింది.

'మీనాక్షమ్మా అన్నానికి రామ్మా' అంటూ వచ్చింది సుందరం.

'తినాలనిలేదు వదినా, తింటే వాంతి అవుతుంది.'

సుందరం నవ్వి 'ఊ! అబ్బాయి బాగా ఏడిపిస్తున్నాడు అమ్మని. అలా అంటే ఎలా మీనాక్షి. కొంచెం ఎంగిలి పడు ఏమీ తినకపోతే మరీ నీరసంగావుంటుంది' అంది.

మీనాక్షి ముఖం చిత్రకళలవలా అయింది.

'ఏమిటి వదినా?' అంటూ వచ్చి కంచం ముందు కూర్చుంది.

అంతే, వరసమ్మ ఒక్క ఉదుటన ముందు కంచం లాగేసింది.

'ఫో. ఇది నా కొడుకు కంచం. ఇందులో తినే హక్కు నీకులేదు. వేరే ఎక్కడేనా తిను రేపట్నుంచి. ఇది ముట్టుకోకు' అంది పిచ్చిపట్టినదానిలా అరుస్తూ.

మీనాక్షి కలుపుకోబోతున్నదల్లా ఆగిపోయింది. నిర్ఘాంతపోయి కూలబడింది.

'ఏమిటమ్మా అవని ఛీ, ఛీ, పెట్టు అది. ముందు అన్నం తీస్తావా? ఎంత పాపం. మళ్ళీ జపంచేస్తావు. ఎందుకు? నువ్వు పెద్దదానివి. నువ్వు చేయవలసిన పనేనా ఇది? ఎందుకు మీనాక్షిని అంత బాధ పెడతావు? అసలే ఒట్టిమనిషికూడ కాదు' అంది సుందరం కోపంగా.

'నీకు తెలియదు నువ్వూరుకో. దీనికింత శాస్తి కావల్సిందే. ఫో. పోయి ఏ ఆకో తెచ్చుకుని మింగు' అంది రుద్రావతారం దాల్చి.

మీనాక్షికి నోట మాటరాలేదు.

మోకాలిమీద ముఖం పెట్టుకుని కూర్చుంది.

దుఃఖం ఆగటంలేదు.

'అమ్మా, మీనాక్షి తినకపోతే నేను తినను ఇవ్వమ్మా. అసలు నువ్వు అవతలికి వెళ్ళు'

వరసమ్మ కూతురివంక చురుకుగా చూస్తూ—

'ఏం తినకపోతే నన్ను ఉద్ధరిస్తారా? క్రింద తినమను. లేకపోతే వాళ్ళమ్మనడిగి వో కంచం చేయించుకు తెచ్చుకోమను. వో విస్తరి కంచమన్నా ఇవ్వలేరూ భాగ్యం? లేకపోతే మాడమను.' అంది. కంచాన్ని విసిరి నేలకేసి కొట్టి.

అన్నం మెతుకులు మల్లెపూలవలె మీనాక్షి వంటి నిండాపడి పగలబడి నవ్వినై.

'నువ్వు పో అవతలికి.' అంటూ సుందరం చుట్టూ మెతుకులు తీసి మరి కొన్ని అన్నం కంచంలో పెట్టి మీనాక్షి ముందు పెట్టింది.

'తినమ్మా మీనాక్షి, అమ్మ మాటలు

సత్తెకాలపు సత్తెయ్యలు









వేష్టించుకోకు. చిన్నవాడు నన్నూ అంతే'

కాని మీనాక్షి వినలేదు. అసలు కూర్చోటానికి మనస్కరించలేదు. లేచి వెళ్ళిపోయింది.

'మీనాక్షి, నా మాట విను. దా, అన్నం తిను. నువ్వు తినకపోతే నేను తినను.' అంది ఆవేదనతో బ్రతిమాలుతూ.

సుందరానికి తల్లి చేష్టకి అసహ్యమేసింది.

'వద్దు వదినా' అంది మీనాక్షి ఏడుస్తూ.

'తినకపోతే ఏం చావదులే పోనీ—మనకి నో పూట బిచ్చ్యం అదా' అంది మీనాక్షి బుగ్గ మీద పొడుస్తూ.

మీనాక్షికి అసలే కళ్ళు తిరుగుతున్నాయి. ఈ అవమానం హృదయాన్ని కాలుస్తున్నది. అడుగులు తడబడుతున్నాయి. నరాలు నిస్సృహతో సిటూరుస్తున్నాయి. మీనాక్షి హృదయం నిండా శూలాలు గ్రుచ్చుకుంటున్నాయి.

తనేం పాపం చేసింది?

'మీనాక్షి, తమ్ముడు ఒట్టు వేసుకున్నాడు. గుర్తుందా? నువ్వు అన్నం తినకపోతే నీకన్నా వాడెక్కువ బాధపడతాడు. ఆవిడ పెద్దది. సగం చచ్చిపోయిన మనిషి. మనమే సర్దుకుంటే సరిపోతుంది. ఈ అవమానం నీకు కాదు. నాది సరేనా, మంచిదానివి కదూ రా—ఆవిడతో సమంగా మీనము వంతాలకి పోతే ఎట్లా రా—' అంది సుందరం వెళ్ళిపోతున్న మీనాక్షిని చూసి.

మీనాక్షి తటాలున ఆగిపోయింది.

'అవును. ఆయన ఒట్టు వేసుకున్నారు. అసలే నోరోజు ఆయనకోసరం వండిన అన్నం పారేయ్యవలసివచ్చింది. ఈరోజు తినకపోతే ఆయన కేమౌతుందో?'

'వస్తానుండు వదిన' అంది సగం ప్రాణంపోయిన గొంతుతో.

మీనాక్షి సరాసరి సరస్వతమ్మ గారింటికి వెళ్ళింది. సరస్వతమ్మకి మీనాక్షి మీద పుత్రికా వాత్సల్యం వుంది.

'ఏం మీనాక్షి ఇట్లా వచ్చావు? భోజనాలు కాలేదా?' అంది సరస్వతమ్మ.

'లేమ్మ వదినా తినాలి. మీ ఇంట్లో

## మొక్కదగినవారు — సుభాషితం



బులుసు వెంకటరమణయ్య

'ఆయన దేవుడిలాంటివాడు. లేవగానే ఆయనకు మొక్కాలి' అని నివర్ని గురించి అయినా అనుకున్నామంటే— అతడు ఉత్తముడన్నమాట! తనకేదయినా మంచి చేస్తేనే యిలా అనుకోవడంకాదు. అందరికీ మేలుచేసినవార్నీ, ఉన్నత భావాలు కలవార్నీ గురించే ఇలా అనుంటాం.

ఈ విధంగా ప్రజల గౌరవాన్ని పొందదగినవారు నలుగురంటే నలుగురే ఉన్నారట! వారెవ్వరో యోచిద్దాం.

కరువు కాటకాలవల్ల ప్రజలు తిండిలేక మలమల మాడిపోతూ ఉంటారు. ధరవరలు ఆకాశాన్ని అంటుతూ వుంటాయి. అట్టి సమయంలో ఐశ్వర్యం వున్నవారే సుఖంగా కాలం గడపగలరు. అట్టి స్థితిలో తిండిలేని జనానికి అన్నం పెట్టే మహానుభావుడే ప్రశంసార్హుడు.

దుర్భిక్షం లేకుండా దేశం సుభిక్షంగా వుండవచ్చు. సరసమైన ధరలకే ఆహార పదార్థాలు, తదితర వస్తువులు దొరకవచ్చు. కాని, వాటిని కొనుక్కోడానికి డబ్బు లేనివారు ఎందరో ఉంటారు. అలాటివారికి సమయంలో డబ్బు ఇచ్చే ఉదారుణ్ణి నమస్కరించాలి.

ఇవి కాకుండా మరొక ఉత్తముడున్నాడు.

శత్రురాజు తన దేశాన్ని ఆక్రమించడానికి వస్తాడనుకోండి. అప్పుడు స్వదేశాన్ని రక్షించుకోడానికి యుద్ధం చెయ్యవలసి వస్తుంది. మొదట్లో ఉత్సాహంవల్ల చాలామంది సిద్ధపడవచ్చు. కాని తీరా యుద్ధం చెయ్యవలసిన సమయంలో అధైర్యపడి వెనకకు రావచ్చు. అల్లా అధైర్యపడకుండా ధైర్యంతో నిలిచేవారు తక్కువ. ఆవిధంగా నిలిచిన వీరుడు ప్రశంసార్హుడు.

అందరూ సంసార సంబంధమైన చిక్కులలో చిక్కుకునే వారే! అప్పులు చేస్తేనేగాని రోజులు గడవకుండా వుంటాయి. ఎట్టి పరిస్థితిలోనైనా అప్పుచెయ్యకుండా ఉన్నదానితో తృప్తిపడేవాడున్నా మొక్కదగినవాడే.

ఈ విధంగా ఈ నలుగురూ ప్రజల గౌరవాన్ని చూరగొంటారని యీ శ్లోకం చెపుతూ ఉన్నది—

'దుర్భిక్షే చాన్నదాతారం
సుభిక్షేచ హిరణ్యదమ్,
చతురోఽహం నమస్యామి
రణేధీరం ఋణేశుచిమ్.'

దుర్భిక్ష సమయంలో అన్నదానం చేసేవాడినీ, సుభిక్షంగా ఉన్నప్పుడు ధనం ఇచ్చేవానినీ, యుద్ధంలో ధైర్యం చూపినవానినీ, అప్పులేనివాడినీ — ఈ నలుగురినీ మొక్కుదును.' అని దీని అర్థం. ●

## అమృత కలశం

రెండు బాదమాకులు కోసుకోవాలని వస్తానని అంది.

'ఏం?' అంది సరస్వతమ్మ కూతురు సీత.

'బాదమాకుల్లో తినాలనుంది సీతా.'

'ఇదేం మనసు మీనాక్షి. ఎక్కడైనా కడుపుతో వున్నవాళ్ళకు ఏదైనా తినాలని వుంటుంది. బాదమాకుల్లో తినాలని వుంటుందా? సరేలే. కోసుకో—' అంది సీత నవ్వుతూ.

'ఊ సీతా, నీవు మరి మితిమీరిపోయావు. పెళ్ళిచేసుకోండి పిన్నిగారు సీతకి' అంది మీనాక్షి.

'హో ఏం సీలా అనుకున్నావా? అయినా నాకేం బాదమాకుల్లో తినాలని వుండదు.'

'చూద్దాంగా'

'సరేలేరా కోసుకుందువుగాని కడుపులో అబ్బాయికి ఆకలేస్తున్నట్టుంది.' అంది సరసతమ్మ.

'ఎత్తుగా వున్నాయి ఆకులు బల్ల తెస్తా నుండు. అదిగో ఆమూల కర్రవుంది తీసుకో.'

'జాగ్రత్త మీనాక్షి అక్కడ కొండ రాళ్ళు తోలించారు మీ బావాయి.!

'వరవాలేదులే పిన్ని.' అంటూ బల్ల ఎక్కి పైకి చూసింది.

సూర్య కిరణాలు సూటిగా కళ్ళలో గ్రుచ్చుకున్నాయి.

నరాలు జివ్వుమన్నాయి.

గుండె దడదడ కొట్టుకుంది.

నీలాకాశం మధ్య నల్లని బాదంచెట్టు కొమ్మలు, పచ్చని ఆకులు, గిరున తిరిగాయి. ఆకలి, అవమానం, నీరసం ఒక్కసారి దాడిచేసినయి. కడుపులో ఎవరో చేయిపెట్టి కెలికినట్లయింది. చేతిలో కర్ర వణికిపోయింది. సూర్యులు కదిలింది.

మీనాక్షి ఒక్క గావుకేకపెట్టి, బల్ల మీద నుంచి పడిపోయింది. పడగానే స్పృహ కోల్పోయింది.

(ఇంకావుంది)




**సి. హెచ్. వి. కె, మొవ్వవరం**

**మనిషి బాగుపడాలంటే ఆత్మ విశ్వాసంతోనా నమ్మకంతోనా?**

చేస్తున్న పనిలో నమ్మకం, చేయగలనన్న నమ్మకం ఉంటే, వాటికి కృషి జతచేస్తే—ప్రతి వ్యక్తీ—బాగుపడతాడు.

**పి. ఎస్. ఆర్, కాకినాడ**

**పవిత్రమైన దేవాలయాలపై మన పూర్వీకులు బూతు బొమ్మలు ఎందుకు చిత్రించారు?**

వారికి బూతు అపవిత్రం కాదు. ధర్మార్థకామ మోక్షాలలో అదీ ఒకటి. భేషజాల్లేని జాతి ఆనాటిది.

**జనశ్రీ, తిరుపతి**

**ఆర్ద్ర కలం పేరుట కదూ?**

అబ్బే కాదండీ— వారు కలం వాడరు. పెన్సిల్‌తోనే రాస్తారే!

**ఎమ్. ఎస్. బి, బెలిమెలా**

**ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ తలపెట్టిన విద్యావిధానము వలన యికమీదట ఆంధ్రులకు ఇంతర రాష్ట్రాలలో మరి చోటుండదు. మన ప్రభుత్వం అందరికీ ఉద్యోగాలు కల్పించలేదు. ఈ విద్యావిధానం వల్ల తెలుగుభాషకి ఒరిగేది ఏమిటి?**

మనం పెట్టం. అడుక్కుతిననివ్వం—అదేకదా మన స్పెషాలిటీ! తెలుగుభాషకి ఒరిగేది ఏమీ ప్రత్యేకం వుండదు. కాని ప్రభుత్వం పుస్తకాలు అచ్చేసుకుని లాభం చేసుకుంటుంది. పెట్టే పబ్లిషర్ల వృత్తి మీద దెబ్బతీసింది. ఇంతకంటే యింకా ఏం కావాలి?

**కె. ఎస్, నగరి**

**వసుంధర పావయ్యగారి చిరునామా చెప్తారా?**

వ. పా గారి చిరునామా కేరాఫ్ యువ, 1, ఆర్కాట్‌వీధి, మద్రాసు 26. అలా బొమ్మలు వేస్తారా ఏమిటి?

**బి. హెచ్, హైదరాబాదు**

**మెడలో బొట్టు తీసి వేయడం బొట్టు కత్తిరించుకోడం చర్చికి వెళ్ళడం తప్పు కాదంటే, అమ్మాయిల పెళ్ళికి కులగోత్రాలు ఎంచడం అన్ సివిలైజ్డుగా?**

అమ్మాయిని ప్రేమించినవాడు 'మన' కులం వాడని ఒద్దనడం సివిలైజుడా గురూ?

**జె. ఎమ్. ఆర్, కాకినాడ**

**కాలం ఎలాగో ఒకలాగ గడిచిపోతుంది, ఈలోగా ఏదో సాధించేయాలని ఎందుకు తాపత్రయం?**

ప్రేమించేవాడు కాలాన్ని వృథా చేయడు. కారణం ఏమిటో తెలుసా? కాలమే ప్రేమ కనుక!

**కె. పి. ఆర్, వరంగల్**

**ఎలా వున్నారని అడుగుతారేగాని చెప్పినది సరిగ్గానైనా వినిపించుకోరేమండీ కొంత మంది?**

ఎలా వున్నారంటే— మీరెలా వున్నారనడం పలుకు. అంతేగాని ఎలా వున్నారని అడిగితే ఎలా వున్నదీ విశదీకరించేవాడే బోర్!

**డి. హెచ్. ఆర్. ఆర్, హైదరాబాదు**

**జోక్‌కి అన్యులు అర్థం ఏమిటండీ రామలక్ష్మిగారూ.**

రెండు భిన్న దృక్పథాలకు దగ్గిర దారే జోక్.

**బి. కె. ఆర్, కొత్తపల్లి**

**చిన్న తప్పు చేశాను. ఒప్పుకోడానికు పౌరుషం అడ్డు వస్తూంది. ఏం చెయ్యమంటారు?**

తప్పు చేస్తే ఒప్పుకోందుకు చిన్నతనం దేనికి? ఒప్పుకోవడం అంటే— మరేం లేదు తమ్ముడూ, నిన్నటి కంటె ఈరోజు తెలివి హెచ్చిందనడానికి చిహ్నమే!

**పి. ఆర్. ఆర్, బి. ఎమ్. కె, ఆర్యూమరు**

**ఆస్తికుడు నాస్తికుడు అంటే ఏమిటి?**

ఆస్తి కలవాడు. ఆస్తి లేనివాడు అనేగా అర్థం!?

**జి. ఆర్. కె, పాల**

**మిమ్మలను ఉడికిస్తూ రాస్తారు కదా కొందరు. మీకేం పట్టనట్టు జవాబులిస్తారెందుచేత?**

బాగుంది! ఉడుక్కోందుకు నేనేం చిన్నపిల్లనా, మాటలు చేతకాని దాన్నా?

**పద్మశ్రీ, బరంపురం**

**మన దేశంలో కరువు ఎందుకు వస్తూంది?**

లక్షల ఎకరాలు సాగుబడి లేక బీళ్ళ కింద పడి వుంటున్నాయి. ఉన్న పంట అందరికీ సరిపోదు— మంది ఎక్కువ అయితే మజ్జిగ పల్చబడక తప్పదు కదా?

**అశోక, పూనా**

**కమ్యూనిస్టులు పరాయి దేశభక్తులు కానంతవరకు మంచిదే నన్న మీ అభిప్రాయం తెలిసికూడా మీరంటే శ్రీశ్రీగారికి ఎందుకు కోపమంటారు?**

మరి వారు పరాయి దేశభక్తులు కాకుండా ఉండడం అనేది అసంభవం కనుక! యిక కర్ణుడి చావుకి కారణాలు వెతికినట్టుంది—శ్రీశ్రీ కోపానికి కారణం! తప్పుదోవ పట్టినప్పుడే — ఉడుకుబోతుతనం, కోపం అన్నీ ఎక్కువ అవుతాయి. ఏమంటారు?

**జె. హెచ్. బి, ముంజులూరు**

**మీకు సినిమాలు చూసే అలవాటు ఉందా? మీ అభిమాన తెలుగు హిందీ హాలీవుడ్ నటీనటులెవ్వరు?**

హిందీలో అశోక్‌కుమార్. హాలీవుడ్ యుల్ బ్రయినర్.

**ఎ. డి, మాచవరం**

**నాతిచరామి అంటే అర్థం ఏమిటి?**

ఈ స్త్రీని వదలను అని. బాగుంది కదూ? మంత్రాలకి అర్థం తెలిపితే వివాహపు తంతు కొంతేనా విలువ మిగుల్చుకుంటుందేమో! లేకపోతే— కట్నం కానుకల పేచీలూ భోజనాల హడావిడులు తప్పించి యింకేం మిగిలి చావడం లేదు.

**బి. ఎస్. పి. ఆర్, తిరుపతి**

**ప్రేమించి పెళ్ళి చేసుకోవడం మంచిదా? పెళ్ళి చేసుకొని ప్రేమించడం మంచిదా? మీరు మీవారి నెలా చేసుకొన్నారు.'**

పెళ్ళంటూ చేసుకుంటే ఎలా చేసుకున్నా మంచిదే— మోసం చేయకుండా. ఇక నా సంగతి దేనికి? ఎదుటి వారిని చూసి వాతలెట్టుకోవడం మంచిది కాదమ్మా, ప్రేమ విషయంలో— ఏ కేసు చరిత్ర ఆ కేసుకే పరిమితం చేసుకోవాలి. నన్ను నన్నుగా ప్రేమించు అంటున్నానే గాని 'పక్కింటి అమ్మాయిని మోహన్ ప్రేమించినట్టు నన్ను నువ్వు ప్రేమించు మోహన్' అని ఎవరూ అనడం లేదు. తెలిసిందా?

**కె. ఆర్. సి, మద్రాసు**

**ప్రేమించడం అంటే ఏమిటి అక్కయ్యా?**

జీవితానికి శాశ్వతంగా రుణపడడమే చెల్లెలా.

**ఇ. వి. వి. ఆర్, ప్రత్తిపాడు**

**తెలిసో తెలియకో ఆత్మీయతను పెంచుకోవడం మంచిదేనా? పొరపాటైతే సరిదిద్దుకోవచ్చు. కాని ఆత్మీయతను వదలుకోలేకుండా ఉన్నారు కొందరిలో.**

మీ ఆత్మీయత వల్ల ఆ 'కొందరికి' యిబ్బంది కల్గితే వదులుకోవడం మీ ధర్మం బ్రదర్.

అయిన వారేకాదు. ఆభగవంతుడుకూడా చిన్నచూపు చూశాడు
అన్నపూర్ణని- అయినా, అన్నిటినీ సహించి ఆవూరివారందరిచేత
"బంగారుతల్లి" అనిపించుకుంది!




బాబు పిక్చర్స్

# బంగారుతల్లి

దర్శకత్వం: చాణక్య
నిర్మాతలు: చేగొండి హరిబాబు
నాము శేషగిరిరావు
సంగీతం: యస్. రాజేశ్వరరావు

లక్ష్మీ ఫిలిం

LAKSHMI

వోర్నా కంబైన్స్ వారి 'తల్లీ కూతుళ్ళు' చిత్రంలోనిదే. వాణిగా వై. విజయ, పద్మశ్రీగా రాజబాబు నటించారు. టి. క్రాంతికుమార్ ఎం. వి. పి. రాఘవరావులు నిర్మిస్తున్న యీ చిత్రానికి జి. రామినీడు దర్శకుడు. ఛటర్జీ నిర్మాణ నిర్వహణను, ఇ. ఎన్. దాస్ కోడైరెక్షన్ను నిర్వహిస్తున్నారు.

## జనంలేని గ్రామానికి మొనగాళ్ళ రాక!

అదొక మారుమూల గ్రామం. ఆ గ్రామ చావడికి మధ్యగా ఒక పెద్ద రచ్చబండ; వూరంతా నిర్మానుష్యంగా వుంది. ఎక్కడి వస్తు సామగ్రి అక్కడే వదలేసి వున్నాయి. అటువంటి పరిస్థితిలోనున్న వూరికి అయిదుగురు నేరస్థులు జీపులో వస్తారు. వాళ్ళకు అక్కడి స్థితి అయోమయంగా కనిపిస్తుంది. వాళ్ళ దృష్టి, ఆ రచ్చబండ మధ్యగానున్న వురికంబం, దానికి వేలాడుతూ గాలికి వూగులాడుతూ సగం తెగివున్న వురి తాడు పై బడింది. అందరి గుండెలు బేజారు అయినాయి. ఇదంతా విచిత్రంగా వుంది కదూ! జన సందోహం లేదు—చిందరవందరగా వున్న గ్రామం—కానీ వూరితాడు. అంటే అక్కడ యేదో దోపిడి, యేదో భయంకరమైన హత్య జరిగి వుండాలిగా. అదేమో మనం యెలా వూహించగలం చెప్పండి. అందుకే సూర్యరాజ్ పిక్చర్స్‌వారి 'మా వూరి మొనగాళ్ళు' సినిమా చూస్తే తెలుస్తుంది.

పై రచ్చబండ సెట్టును 40 వేల ఖర్చుతో శ్యామలా స్టూడియోలో వేసి, ఆ దృశ్యాలను అత్యంత సహజంగా చిత్రించారు నిర్మాతలు కె. ఎస్. కృష్ణంరాజు, ముంగండ సూర్యనారాయణగారు, దర్శకుడు విజయ్ సహానంద్. 'ఇప్పటికి 10 రీళ్ళ చిత్రం అయింది. మరికొంత అవుట్‌డోర్ పని వుంది. రెండు పాటలను విజయలలిత పైన ఒక పాటను జ్యోతిలక్ష్మి పైన చిత్రీకరించాము. ఈ చిత్రంలో మోటారు బైక్ ఛేజింగ్, జీపు ఛేజింగ్ లాంటి థ్రిల్లింగ్ సన్నివేశాలు వున్నాయి—' అన్నారు నిర్మాతలు. 'హీరో క్రిష్ణ మాకు యిచ్చే సహకారాన్ని యెన్నటికీ మరువలేము' అన్నారు నిర్మాతలు.



'మావూరి మొనగాళ్ళు'లో ఒక దృశ్యం. కృష్ణ, విజయలలిత.

## జమున కుమారుని పుట్టిన రోజు

నటి జమున దగ్గరనుండి ఒక బుల్లి ఆహ్వానం వచ్చింది. సెప్టెంబరు 20 న ఆమె కుమారుడు చిరంజీవి వంశీకి పుట్టినరోజు పండుగను చేస్తున్నట్లు, సరిగ్గా సాయంత్రం ఆరున్నర గంటలకు రమ్మని ఆ పత్రికలో వుంది.

* * *

హబిబుల్లా రోడ్డులో వెలసివున్న ఏస్ జి ఎన్. కళ్యాణ మంటపంలో వంశీ పుట్టినరోజు పండుగ అత్యంత వైభవంగా జరిగింది. ప్రముఖ దర్శకులు బి. ఎన్. రెడ్డి, నిర్మాత డి. ఎల్. నారాయణ, సత్యనారాయణ, సూర్యనారాయణ (సత్యచిత్ర), సి. ఎస్. రాజా, కె. వి. ప్రభాకర్, కరినారాయణరెడ్డి, నటి వాణిశ్రీ, జయంతి, రాజశ్రీ, చంద్రకళ ప్రభృతులు వచ్చి వంశీకి శుభాశీస్సులను, కానుకలను అందచేసారు. బర్త్‌డే కేక్‌తో పాటు టీపార్టీ కూడా లభించింది. టీ తర్వాత జమున రమణారావుగార్ల వివాహ సందర్భంగా తీసిన చిత్రాన్ని చూపించారు



వంశీకృష్ణ

* * *

చి. వంశీ చూడ ముచ్చటగా, తన ముద్దు ముఖంతో వచ్చిన పెద్దవారందరికీ చేయెత్తి నమస్కరించినప్పుడు యింత చిన్న వయస్సులో యెంత సంస్కారం అబ్బింది అని అందరూ ఆశ్చర్యపోయారు.

—శ్రీనివాస్



ఉషశ్రీ పాటల రికార్డింగుకు హాజరైన తారలూ—తదితరులూ.

ఆంగ్లంలో 'యిన్విన్సిబల్ కిక్' చూశారా? ఆ చిత్రాన్ని ఆధారంగా తీసుకుని, మన ప్రేక్షకులకు నచ్చే మరికొన్ని అంశాలను చేర్చి 'మా వూరి మొనగాళ్ళు' నిర్మించబడుతూ వుంది. ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను క్రిష్ణ, ప్రభాకరరెడ్డి, నాగరాజు, జగ్గారావు, ఆనంద్, విజయలలిత, జ్యోతిలక్ష్మి, జా. కాంచన, క్రిష్ణవేణి పోషిస్తున్నారు.

సినిమా

## త్రిమూర్తి ప్రొడక్షన్స్ కలర్ చిత్రం!

ఉత్సాహవంతులయిన యువకులు శ్రీ పి. బాబ్జి, శ్రీ జి. సాంబశివరావులు 'త్రిమూర్తి ప్రొడక్షన్స్' పేరిట చిత్ర నిర్మాణసంస్థను స్థాపించారు. సంస్థ ప్రముఖ నిర్మాత శ్రీ డూండీ ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్నది. నాడు అగ్రశ్రేణి నటిగా పరిగణింపబడుతున్న 'వాణిశ్రీ'ని 'కులపురాని కథ' చిత్రంద్వారా కథానాయికగా ప్రజెంట్ చేసిన శ్రీ డూండీ యీ సంస్థ నిర్మించే చిత్రంలో 'శుభ' అనే కొత్త అమ్మాయికి కథానాయికగా అవకాశం కల్పిస్తున్నారు.

మరాఠీ భాషలో అనేక అవార్డులు గెలుచుకున్న 'అపరాధ్' చిత్రం ఆధారంగా యీ చిత్రం పూర్తిగా రంగులలో నిర్మించబడుతున్నది. ఉత్సుకతను రేకెత్తిస్తూ అసాధారణ కథాంశంతో సాగిపోయే యీ చిత్రంలో కృష్ణ కథానాయకుడు. మిక్కిలినేని, నాగయ్య, ప్రభాకరరెడ్డి, కె. జగ్గారావు, ఛాయాదేవి యితర ముఖ్యభూమికలకు యింతవరకు ఎన్నుకోబడ్డారు.

సహజ వాతావరణంలో పూర్తిగా అవుట్‌డోర్స్‌లో సుందర ప్రకృతిలో నిర్మించే యీ రంగుల చిత్రం షూటింగ్ అక్టోబరులో ప్రారంభించి, డిసెంబరు మాసాంతానికి పూర్తిచేయాలనే సంకల్పంతో వున్నారు, నిర్మాతలు.

స్క్రీన్‌ప్లే: పి. డూండీ, దర్శకత్వం: పి. లక్ష్మీదీపక్, మాటలు: సుంకర? రావ్, పాటలు: కొసరాజు, దాశరథి, ఆరుద్ర, సంగీతం: యస్. పి. కోదండపాణి, కెమెరా: రాజు, కూర్పు: ఎన్. ఎస్. ప్రకాశం నిర్వహించే యీ చిత్రానికి కెమెరా పర్యవేక్షణ, సాంకేతిక సలహాదారుడు: రవికాంత్ నగాయిచ్. నిర్మాతలు: పి. బాబ్జి, జి. సాంబశివరావు.

శ్రీ పిక్చర్స్ ద్వారా యీ చిత్రం ఆంధ్రప్రదేశ్ అంతటా విడుదల అవుతుంది.

## 'మానవుడు దానవుడు' ప్రారంభం

ఉషశ్రీ వారి మూడవ చిత్రానికి 'మానవుడు దానవుడు' అని పేరుపెట్టారు. ఈ చిత్రానికిగాను సెప్టెంబరు 14న మూడు పాటలను విజయా గార్డెన్స్‌లో సంగీత దర్శకుడు అశ్వత్థామ రికార్డ్ చేశారు. రికార్డింగుకు సావిత్రి, శారద



'తల్లీ కూతుళ్ళు'లో కాంచన

కృష్ణకుమారి, మీనాకుమారి. శోభన్ బాబు, చలం, సత్యనారాయణ, ముక్కామల, అనిల్ ప్రభాష్ అంకినీడు, రాజామోహన్, కాంకరయ్య, 'భక్తపోతన' నిర్మాత విశ్వేశ్వ

గ్రాహులు వచ్చి నిర్మాత చిన్నపరెడ్డికి శుభాకాంక్షలు తెలిపారు. మూడు పాటలో ఒకదాన్ని నారాయణరెడ్డి, ఒకదాన్ని దాశరథి, మూడవదాన్ని చిన్నపరెడ్డి వ్రాసారు. మొదటి

రెండు పాటలను సుశీల, మూడవ పాటను ఎల్. ఆర్. ఈశ్వరి పాడారు.

కవి నారాయణరెడ్డి కలం చిందించిన ఆణిముత్యంలాంటి పాటకు, మధురగాయని

మైన రచన చెయ్యగల ప్రతిభ బాల్యి ముంతకు వుందని యీ చిత్రం నిరూపిస్తుంది.

## పేరు ఎలా ఉంది?

'ప్రియబాంధవి' అని పేరు పెట్టదలిచాను. ఎలా వుంది?' అని ప్రశ్నించారు బి. ఎస్. నారాయణ. 'బాగానే వుంది. కొత్త క్లాస్ టైటిల్ అనిపిస్తుంది', అన్నాను. 'ప్రైలా వచ్చిను—యిది ఎలా వుంది?' అన్నారు. 'ఇది మాస్ టైటిల్ లాగ వుంది', అన్నాను. అంతలో 'షాటు రెడీ సార్', అన్నాడు అసోసియేట్. 'మళ్ళీ కలుస్తాను' అని వచ్చేసాను. మహావిష్ణు ప్రొడక్షన్స్ చిత్రంలో సావిత్రి, వాణిశ్రీ, క్రిష్ణ, నాగభూషణం, రాజబాబు ముఖ్య పాత్రధారులు. జి. కె. వెంకటేష్ సంగీత సారధి; సి. హెచ్. ఇ. ప్రసాద్ శిల్ప దర్శ

మూడు విజయవంతమయిన బ్లాక్ అండ్ వైట్ చిత్రాలను నిర్మించిన వై. వి. రావ్ తమ నాల్గవచిత్రాన్ని ఈస్ట్మన్ కలర్‌లో నిర్మిస్తున్నారు. ఈ చిత్రంయొక్క షూటింగు సెప్టెంబరు 1న ప్రసాద్‌లో ప్రారంభమైంది. నటరత్న ఎన్టీ రామారావు క్లాప్‌కొట్టారు. పూర్ణా కామరాజు స్విచ్ ఆన్ చేసారు. 'ఎన్టీఆర్ హస్తవాసి చాలామంచిది. అందుకే ఆయన్ను మా చిత్రాలకు క్లాప్‌కొట్టమని అర్థించే ఆనవాయితీని పెట్టుకున్నాము' అన్నారు వై. వి. రావ్.

## సంక్రాంతి కానుక

సెక్స్ బాంబ్‌షెల్ ఆఫ్ ది సౌత్‌గా విరాజిల్లుతున్న జ్యోతిలక్ష్మి ఆంధ్రా జేమ్స్ బాండ్ క్రిష్ణతో నాయికగా నటిస్తూంది చిత్రంలో. ఒక రసవత్తరమైన కథను ఎన్నుకుని, జనరంజకంగా మలచి, పాత్రలకనుగుణమైన తారాగణంతో నిర్మాణానికి పూనుకున్నారు. రాకెట్ స్పీడుతో షూటింగు సాగుతూంది. మూడుమాసాల్లో షూటింగు పూర్తిచేసి, సంక్రాంతి కానుకగా ఆంధ్ర ప్రేక్షకులకు సమర్పించాలని నిర్మాత సంకల్పం. 'మోసగాళ్ళకు మోసగాడు' చిత్రంలో ఒక నృత్యదృశ్యంలో పాల్గొన్న రాజసులోచన యీ క్రైమ్ థ్రిల్లర్‌లో వాంప్‌గా నటిస్తూంది ఇతర ముఖ్యపాత్రలను సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, నల్ల రామ్మూర్తి పోషిస్తున్నారు. ఈ చిత్రంయొక్క సాంకేతికశాఖలను సత్యం (సంగీతం) [illegible] (కథ) 'దేవరాజు (ఛాయ) [illegible] (కూర్పు) కత్తుల గోపాలకృష్ణ (సహాయదర్శకత్వం) అండ్ కె. వి. ఎస్. కుటుంబరావు దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. సెప్టెంబర్‌లో (మొదటి షెడ్యూలులో) జ్యోతిలక్ష్మిపై రెండుపాటల చిత్రీకరణ, కొన్ని ముఖ్యసన్నివేశాల చిత్రీకరణ జరిగింది.

## స్నానాల గదిలో చక్కిలిగింతల దృశ్యం

చిన్న టవల్ కట్టుకుని స్నానం చెయ్యటానికి బాత్‌రూంలోకి వచ్చాడు కృష్ణ. తన భర్తకు వీపు తోమటానికై రామం కూడా ఆ గదిలోకి వచ్చింది. వస్తూనే ఓ చెంబెడు నీళ్ళు కృష్ణ మీద కుమ్మరించింది. **'అమ్మో, తోలూడింది' అంటూ** డ్యాన్స్ ప్రారంభించాడు.

'అంత వేడిగా వున్నాయా' అంది రామం. 'పోసుకో, నీకే తెలుస్తుంది' అంటూ ఆమె మీద పోసాడు. 'ఏం పని చేశారండి—మీ అక్కయ్యగారు చెప్పినట్లు చేసాను' అంది (మూతి తిప్పుతూ) రామం. 'కాదు, కాదు నే చేస్తున్నదే ఆమె అంటూంది' అన్నాడు క్రిష్ణ (దీకో

దాత్తంగా). 'తొందరగా కానివ్వండి. లేక పోతే మీ చదువు పాడవుతుంది' అని బ్రతిమలాడింది రామం; 'మరయితే ఒక్కసారి వీపు తోమెయ్యి, తుడుచుకు పోతాను' అన్నాడు కృష్ణ. రామం వీపు తోముతూ చక్కిలిగింతలు పెట్టింది. 'నిన్ను చక్కిలి-

# సినిమా

గింతలు పెట్టమన్నానా?' అని ప్రశ్నించాడు కృష్ణ. 'అయితే అబ్బాయిగారికి సిగ్గెక్కువుందన్న మాట' అంటూ మరింత హుషారుగా చక్కిలిగింతలు పెట్టసాగింది రామం. ఆ గిగిలింతకు నవ్వు ప్రవాహం

లతో మారుమ్రోగింది. 'కట్' అన్నారు దర్శకుడు వైకుంఠరామశర్మ. ఈ చక్కిలిగింతల దృశ్యం గణేష్ చిత్రాలయ వారి 'శాంతి నిలయం'లో కనిపిస్తుంది. కృష్ణగా శోభన్, రామంగా చంద్రకళ సహజంగా నటించారు.

'శాంతి నిలయం' చిత్రానికి ఆచార్య ఆత్రేయ సంభాషణలను, కోదండపాణి సంగీతాన్ని, వి. ఎస్. ఆర్. కృష్ణారావు ఛాయను నిర్వహిస్తున్నారు. కథను దర్శకుడే వ్రాసారు. ముఖ్య పాత్రలను ఎస్వీరంగారావు, నాగభూషణం, రమణారెడ్డి, రావి కొండలరావు, అంజలీదేవి, చంద్రకళ, ఝాన్సీ, రాధాకుమారి, బేబి రాణి పోషిస్తున్నారు. హీరోగా శోభన్ నటిస్తున్నారు. ఈ చిత్రాన్ని సర్కారు జిల్లాలలో లక్ష్మీనారాయణ పిక్చర్స్, రాయలసీమలో బలరాం పిక్చర్స్, నైజాంలో కనకదుర్గా ఫిలింస్ విడుదల చేస్తారు.

—శ్రీనివాస్ ●



## తారలకూ నక్సలైట్ల బెడద ఉంది!

## కాలేజీ అమ్మాయిల్ని చూడండి!

నక్సలైట్ల బెడద గ్రామాలు ప్రజా నీకానికే కాదు. ఇప్పుడు సినిమా తారలకు కూడా ఏర్పడిపోయింది. కలకత్తా నగరంలో ఎప్పుడూ నక్సలైట్లు స్వైర విహారం చేస్తూ ఉంటారన్న సంగతి అందరికీ తెలిసినటువంటి విషయమే! అయితే వారు యింతవరకూ సినిమా తారల జోలికి పోలేదు. పోలీసుల్ని, ధనవంతుల్ని మాత్రమే వారు వేటాడటం మనం ఎరుగుదుం.

ధనవంతులైన ఇద్దరు అగ్రశ్రేణి బెంగాలీ నటీ నటులు ఇటీవల నక్సలైట్ల చేత వేటాడ బడి ప్రాణాలతో తప్పించుకుని బొంబాయికి వచ్చిన ఉదంతం ఒకటి విశ్వసనీయంగా తెలియ వచ్చింది.

ఆ తారల పేర్లు: ఉత్తమకుమార్, సుప్రియా చౌదరి, పేరుపొందిన బెంగాలీ చిత్రాల్లో పేరుపొందిన తారలు. కిందటి నెలలో ఒక రోజు వీరిద్దరూ ఒకచిత్రం షూటింగ్ విరామ సమయం (కలకత్తా స్టూడియోలో) పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నప్పుడు . . హఠాత్తుగా ఒక గుంపు వచ్చి పదివేల రూపాయలు కావాలని ఒత్తిడి చేశారట. ఆ సమయంలో దగ్గర ఎవ్వరూలేదని, వారు తమ అసహాయతను తెలిపినా వినలేదట. షూటింగ్ చూడటానికి వచ్చిన జనం యీ దృశ్యం చూసి హడలి పోయి పారి పోయారట ఆ తార లిద్దర్నీ అలాగే వదలేసి.

ఉత్తమకుమార్, సుప్రియ చౌదరిలు నక్సలైట్లనుంచి ఎలాగో తప్పించుకుని బయట పడి— బొంబాయికి వెంటనే బయలుదేరే విమానంలో ఎక్కి బొంబాయి చేరుకున్నారట!

ఈ సంఘటనకు ముందు జరిగిన ఒకవిష యాన్ని ఉత్తమకుమార్—బొంబాయి షెడ్ లోని తన మిత్రుడు ఒకరికి తెల్పారు. ...లేసి, తనను చిత్రాలలో నటించటం ...దిగాను, సంపాదనను అప్ప...ను, ఈ సంఘటనకు ముందు వారం రోజుల క్రిందట తనకు అనేక ఉత్తరాలు బెదిరింపు ధోరణిలో అందినవని అన్నారు.

ఈ తారలిద్దరూ బొంబాయిలో ఉంటున్న విషయం తప్పించుకు వచ్చిన వైనం ఫిలిమ్ సర్కిల్స్‌లో అతిరహస్యంగా ఉంచబడుతున్నది.

* * *

కొందరు సినిమా తారల వస్త్రధారణ దుస్తులు చాలా అభ్యంతరకరంగా ఉంటున్నాయని కొందరు ఆరోపిస్తున్నారు. మేము నగ్నంగా వేసుకోమంటేనే వేసుకుంటున్నాం గాని లేక పోతే మాకేం సరదానా? అంటూ జవాబు చెబుతున్నారు తారలు.

ఇటీవల హిందీతార రేఖ చాలా సెక్సీ డ్రస్ ఫోటో ఒకటి ఒక ప్రముఖ పత్రికలో ప్రచు రించబడింది. అది జనంలో ఎంతో సంచలనం తీసుకు వచ్చింది. బొంబాయి స్టూడియో సెట్స్‌మీద కొందరు విజిటర్స్ రేఖను కలిసి నపుడు 'మీరు ఇలాంటి డ్రెస్‌లు వేసుకోవటం వల్ల చదువుకునే ఆడపిల్లలు కూడా ఇలాంటివే ధరిస్తున్నారు. మగవాళ్ళని రెచ్చ గొట్టి ఆ తర్వాత అనేక అనర్థాలకు గురవుతా తున్నారు. అందుచేత ఈరకమైన ఉడుపుల్ని ధరించటం మానేయండి' అని అడిగారు.

అందుకు రేఖనవ్వి 'కాలేజీ అమ్మాయిల్ని చూడండి! ఈ డ్రెస్‌లు ఫాషన్‌లు వాళ్ళు అలవాటుచేసినవే! మేము వాళ్ళని చూసే అనుకరిస్తున్నాంగాని, మమ్మల్ని చూసివాళ్ళు ఫాలో అవటం లేదు. ఎప్పుడూ షూటింగుల హడావుడిలో వుండే మాకు ఎపుడే ఫాషన్ వస్తున్నదో ఎలా తెలుస్తుంది? ఇలాంటి డ్రెస్‌లు, ఫాషన్‌లు ముందుగా కాలేజీల్లోకి వచ్చి, తర్వాత సినిమాల్లోకి వస్తున్నాయి' అన్నది.

—మోహన్ కుమార్

**అవీ.. ఇవీ:**

## శ్రీ. శే. రామన్

దత్తారామ్ అండ్ కంపెనీ సంస్థ అధిపతి శ్రీ టి. ఎస్. రామన్ సెప్టెంబరు 9 న రాత్రి బొంబాయిలోని థాతా మెమోరియల్ ఆసుపత్రిలో మరణించారని తెలుపటానికి చింతిస్తున్నాము. (ఎ. వి.)

# చిత్రసమీక్ష

(48వ పేజీ తరువాయి)

వి. చలం, రమాప్రభ, కాకరాల, మీనా కుమారి యితర భూమికల్ని పోషించారు.

కథ : కోడూరి కౌసల్యాదేవి. మాటలు, పాటలు : ఆచార్య ఆత్రేయ. సంగీతం : కె. వి. మహదేవన్. కళ : ఎస్. కృష్ణారావు. కెమెరా : వి.ఎస్. వెంకటరత్నం, కూర్పు : మార్తాండ్ నిర్వహించిన యీ చిత్రానికి దర్శకత్వం: శ్రీ కె. ఎస్. ప్రకాశరావు. నిర్మాత : శ్రీ డి. రామా నాయుడు.

సెప్టెంబరు 24 న ఆంధ్రప్రదేశ్ అంతటా నవయుగా ఫిలింస్ ద్వారా విడుదల అయి విజయవంతంగా ప్రదర్శింప బడు తున్నది.

— మోహన్ కుమార్ ●

Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty 1; and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.




లండన్ సెయింట్ జేమ్స్ పాలస్ రక్షక భటుని పక్కన నిలబడ్డ ఈ
అమ్మాయి మిస్ ఇంగ్లండ్, మిస్ యునైటెడ్ కింగ్



సురేష్ మూవీస్

# ప్రేమనగర్

ఈస్ట్మన్ కలర్

నిర్మాత
డి. రామానాయుడు

దర్శకత్వం:
కె. ఎస్. ప్రకాశరావు



